వేంకటశాస్త్రి, ఆకుండి

# బుద్ధునిపూర్వజన్మములు

విజయనగరము, 1925

Record no. 695

Vēṅkaṭaśāstri, Ākuṇḍi

Buddhunipūrvajanmamulu

Vijayanagaramu, 1925

Record no. 695

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

Bibliographic Record Target

వేంకటశాస్త్రి, ఆకుండి.

బుద్ధునిపూర్వజన్మములు / గ్రంథకర్త  ఆకుండి వేంకటశాస్త్రి.- విజయనగరము : కె. శ్రీనివాసరావు, 1925.

2, (3), 114 p. ;18 cm.

Record no. 695

Vēṅkaṭaśāstri, Ākuṇḍi.

Buddhunipūrvajanmamulu / granthakarta  Ākuṇḍi Vēṅkaṭaśāstri.- Vijayanagaramu : Ke. Śrīnivāsarāvu, 1925.

2, (3), 114 p. ;18 cm.

Record no. 695

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB    Date filming began:

# బుద్ధుని పూర్వజన్మములు.



ప బ్లి ష రు:

కె. శ్రీనివాసరావు,

శ్రీ వేదవ్యాస ముద్రాలయము,

విజయనగరము.

1925.

జిష్టర్డు ]                వెల, 0-8-0.

Approved by the Madras Text Book Commi[ttee]

శ్రీరస్తు.

# బుద్ధుని పూర్వజన్మములు.




గ్రంథకర్త:

ఆకుండి వేంకటశాస్త్రి.

శ్రీ శ్రీ శ్రీ విజయనగరము మహారాజావారి సంస్కృత కళాశాలాంధ్ర పండితుఁడు, విజయనగరము.



ప్రకాశకులు:

కె. శ్రీనివాసరావు,

శ్రీ వేదవ్యాస ముద్రాలయము,

విజయనగరము.

1925.


 వెల, 0-8

రెండవ కూర్పు



# ఉపోద్ఘాతము

ప్రపంచమున మనదేశమునకుఁగల ప్రఖ్యాతికి మనపూర్వుల విజ్ఞానమే కారణము. ఉత్కృష్టమతములలోనివగు హిందూబౌద్ధమతములకు మనదేశము పుట్టినిల్లైయున్నది. కాని దేశచరిత్రను బఠింపనివారిలో ననేకులకు బౌద్ధమతవిషయమగు ఘనత తెలియుట దుర్లభమైయుండెడిది. ఇప్పుడిప్పుడు దీనినిగుఱించి మనభాషలోఁ గొన్నిగ్రంథములు ప్రకటితములగుచున్నవి. బ్రహ్మశ్రీ ఆకుండి వెంకటశాస్త్రులవారి గ్రంథము వీనిలోనొకటి. ఇట్టివాని సంఖ్య యధికమైనయెడల మనయాంధ్రవాఙ్మయము నూతనవికాసము వహించుననుటకు సందియముండదు.

తక్కిన మతవాఙ్మయములందువలె బౌద్ధమతవాఙ్మయమందునయితము రెండురకముల గ్రంథములున్నవి. అతిగూఢములై పండితులకుమాత్రముపయోగపడు తత్వగ్రంథములు మొదటిరకములోనివి. సాధారణుల యుపయోగమునకై వ్రాయఁబడిన కథా గ్రంథములు రెండవరకములోనివి. మనమతము వ్యాపించుటకుఁ బురాణములెట్లో యిప్పటికిఁగూడ బౌద్ధదేశములందంతట నట్లే యీకథా గ్రంథములమూలమున సామాన్యజనులు మతరహస్యముల నేర్చుకొనుచున్నారు. బౌద్ధకథాగ్రంథములన్నిటిలో 'జాతక' కథలు మిక్కిలి ప్రఖ్యాతి గాంచియున్నది.

బౌద్ధగ్రంథములు తొలుదొల్త 'పాళి' భాషలో వ్రాయఁబడినవి. పూర్వముత్తరహిందూస్థానమందు జనసామాన్యము వాడుకొనుచుండిన భాషకు 'పాళి' యని పండితులనేకులభిప్రాయపడుచున్నారు. జాతకకథలన్నియు నీభాషలోనే యున్నవి. కాని కొంతకాలమైనతర్వాత బౌద్ధమతస్థులుకూడ సంస్కృతమును గౌరవించుచు సంస్కృతభాషతో గ్రంథములవ్రాయసాగిరి.

జాతకకథలు బుద్ధునిపూర్వజన్మముల వివరించుకథలు. ఇప్పటికి నుమారు రెండు వేలనాలుగువందలసంవత్సరములనాఁడు మనదేశమున మతప్రచారము గావించిన గౌతమబుద్ధుఁడు తత్పూర్వము, అయిదువందల నలువదియేడుజన్మములు గలిగియుండెననియు, నొక్కొక యవతారమందొక్కొక శుభకార్యము గావించి ప్రజలకు నీతిబోధించెననియు బౌద్ధులనమ్మకము. ఈజాతకకథలలోఁ గొన్నిటిని ఆర్యశూరుఁడనుకవి జాతకమాలయను పేరితో సంస్కృతభాషలో వ్రాసియున్నాఁడు. దానిననుసరించియే బ్రహ్మశ్రీ వేంకటశాస్త్రిలవారీ గ్రంథమును వ్రాసిరి.

ఈపదునాలుకథలను శ్రద్ధతోఁ జదువువారికి బౌద్ధమతధర్మములలో ముఖ్యములగు వైరాగ్యము భూతదయలోనగు వానిమహిమ చక్కఁగ బోధపడఁగలదు. మఱియు గ్రంథశైలినిబట్టి పాఠశాలలందు విద్యనేర్చుకొను విద్యార్థులు దీనినిబఠించుటవలన మిక్కిలి లాభమునొందఁగలరు. కావున నీగ్రంథమునకు విశేషముగఁ బ్రచారముండునని నానమ్మకము. బౌద్ధమతమునకు సంబంధించిన గ్రంథములనేకములనువ్రాసిబ్రహ్మశ్రీ వేంకటశాస్త్రిలవారాంధ్రప్రపంచము యొక్క. కృతజ్ఞతకుఁ బాత్రులగుదురని నాయుద్దేశము.

మామిడిపూడి వేంకటరంగయ్య, ఎం. ఏ.
ప్రధానచరిత్రోపన్యాసకులు,
శ్రీ మహారాజావారికాలేజీ, విజయనగరము.

# పీఠిక.

మహాశయులారా !

ఆంధ్రవాఙ్మయము మనసోదరభాషాసేవకుల సహాయముఁగలిమిబలిమిచే నానాఁటికభివృద్ధినొంది గద్యపద్యమయాత్మకంబులగు పెక్కుగ్రంథములు వెలువడుచున్నవి. అందు నాయీచిన్ని పొత్తమొకటి. ఇయ్యది సంస్కృతభాషామయమగు జాతకమాలయను గ్రంథముననుసరించి వ్రాయఁబడినది. కాని యిందుఁ గొలఁదిమార్పులును గూర్పులును గలవు. మఱియు నిది మహనీయుఁడగు బుద్ధునిపూర్వజన్మచరిత్రకథలు గలదగుటచే నెల్లరకాదరణీయమగునని తలంచెదను. నాకులభించిన జాతకమాలయందు ముప్పది రెండుకథలున్నను వానిలో నాకుఁదోఁచినవి పదునాలుకథలుమాత్రము వ్రాసితిని. ఇదివ్రాయుటకు నన్నుఁబ్రోత్సహించి యనుఁగొంతవఱకు మార్గదర్శకులై మఱియు దీనికుపోద్ఘాతమును దయచేసివ్రాసిన బ్రహ్మశ్రీ మామిడిపూడి వేంకటరంగయ్యపంతులుగారికి మిగులఁగృతజ్ఞుఁడనై వందనములర్పించుచున్నాఁడను.

ఇందుఁగొలఁదిదోషములున్నను గుణజ్ఞులగుపాఠకులు క్షమింతురని నమ్ముచున్నాఁడను.

ఇట్లు,

అకుండి వేంకటశాస్త్రి,

ఆంధ్రోపాధ్యాయుఁడు,
శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల, విజయనగరం.

## కృతిసమర్పణము.

గీ. భక్తులమనం బెఱుఁగి వారి • భవ్యకాంక్ష
తెల్లనొసఁగుట శ్రితకల్ప • వల్లియనెడు
నుతిఁగనిన వేంకటేశ దే • వతకునిదికృ
తాంకితంబౌట భువిఁజిరం • బలరుఁగాక.

## విషయసూచిక.



# బుద్ధుని పూర్వజన్మములు

## 1-వ కథ - వ్యాఘ్రజాతకము.

ఒకప్పుడు బోధిసత్త్వుఁడు, స్వధర్మాచరణశీలుఁడును, శుద్ధస్వభావుఁడును నగునొకబ్రాహ్మణునకుఁ బుత్త్రుఁడై యవతరించి కాలక్రమమునఁ దనబాల్యమును సకలవిద్యలకు వినియమొనర్చినవాఁడువలె యౌవనవంతుఁడై విద్యానిధియనుటకుఁ దగియుండెను. అంతటఁ దన సుగుణములకు వలచినదిపోలె రాజసత్కారాది యశఃకాంత యాతనివరించెను గాని దానినాతఁడు ప్రేమింపక భోగములు దోషభూయిష్ఠములని యెంచి శాంతరసభరితమగు నొకవనము నలంకరించెను. నిర్జనమగునాయరణ్యమునఁ బరమశాంతుఁడగు నాబోధిసత్త్వుని శమప్రభావఫలము నపేక్షించినవిపోలె మృగములెల్లఁ బరస్పరవైరములుజ్జగించి యాతనినాశ్రయించి చరింపమొదలిడెను. ఇట్లుకొన్నిదినములు గడచెను. పిమ్మటఁ దత్సమీపారణ్య వాసులగు కొందఱుమునులాతని సత్స్వభావమునకుఁ బరమాశ్చర్యపరవశులై యాతని సదుపన్యాసములచేఁ గాలము పుచ్చుచుండిరి. అంతియగాక కొన్నినాళ్లకతఁడట్లు పరివ్రాజకుఁ డగుటఁ దెలిసి మున్నాతనినెఱింగినవారు కొందఱాతనియెడఁగల గౌర

వాతిశయముచే నాతనికి శిష్యులుగాఁదలంచి యాయరణ్యా
శ్రమమునఁ జేరికొనిరి. జ్ఞానాభిలాషులైవచ్చిన యాశిష్యుల నా
తఁడు తత్త్వజ్ఞానధనసంపన్నులఁగా నొనర్చుచువచ్చెను. అట్లుం
డఁగా నొకప్పుడీమహానీయుఁడు తనయొద్దఁజదువుకొనినశిష్యు
లనేకులు సకలవిద్యాపరిపూర్ణులై వెలయుటంజూచి మూఢ
మగునీలోకము నుద్ధరించుటకై వారికి సెలవిచ్చిపంపెను. వారి
సద్బోధనలచే లోకమున ధర్మదేవత సుఖముగా విహరించుట
కై యపాయద్వారములన్నియు మూయఁబడి సుగతిమార్గము
లెల్ల రాజమార్గములై యలరుచుండెను. పిమ్మట నీబోధిస
త్త్వుఁడు తత్కాలశిష్యుఁడగు నజితునితో యోగాభ్యాసమున
కనువగు పర్వతనదీకుంజములను వెదకుచు సంచరించుచుండెను.
అంతటనొకచో నచిరప్రసూతయై యొకవ్యాఘ్రాంగన, ప్ర
సూతిక్లేశముచేఁ జూపులువెల్లవాఱ నాఁకలిచేఁగృశించి, తల్లి
యను విశ్వాసముచే స్తన్యమునకై తనచెంతఁజేరు పిల్లలను
సైత మాహారముగాభావించి భయంకరముగనఱచుచు నితని
కంటఁబడెను. మిక్కిలిధైర్యశాలియయ్యు నితఁడు దానింగాం
చి భూకంపముచేఁ గొండవలెఁ బరదుఃఖాసహిష్ణువగుటచే మి
గులఁజలింపఁజొచ్చెను. తమకాపదలు పెక్కు సంభవించినను
గొంచెమేని చలింపని ధైర్యవంతులును నొక్కొకపుడు భూత
దయావిష్టులై పరులకు సంభవించు నల్పములగు నిక్కట్టులను
సైతము మిక్కిలిబెగడుట వింతకాదుగదా! అనంతరమాబోధి
సత్త్వుఁ డట్లాకస్మికముగఁ గలిగినసంభ్రమము తనసహజకృపా
ళుత్వమును వెల్లడింప దయారసగుంభితములగు మృదువచనము



లతో 'ఓవత్సా! చూచితివా? ఎంతవింత! ఈయాఁడుబెబ్బులి
యాఁకలిచేఁ బ్రేమయొకింతయులేక తనసంతతిని సైతము భు
జింపఁగోరుచున్నది. ఇందులకుగుణహీనమగు సంసారమేగదా
కారణము. అయ్యో! ఇప్పులి తానుగడుపారఁగన్న బిడ్డలను
దనకాహారముగ నెంచుచున్నదే. ఈదేహాభిమాన మెట్టిక్రూర
కృత్యములనైనఁ జేయించునుగదా! కావునట్టి దారుణకృత్య
ములకుఁ బ్రధానకారణమగు దేహాభిమానమను శత్రువునెవ్వఁ
డును బోషింపరాదుసుమీ! అదియటుండనిమ్ము. ప్రకృత
మున మనకొకటి కర్తవ్యమైయున్నది. తొలుతమనము దీని
యాఁకలి దీఱునంతటి యాహారమొసంగవలయును. కావుననీవి
పుడు దీనికిఁ బుష్కలమగు నాహారమును వెదకుము. నేనును
దీనినీసాహసకార్యమునుండి మరలించెదను' అని పలికెను. వాఁ
డును గురువచనంబుల కొడంబడి, తదాహారసంపాదనముకై
యత్నించుచుంబోయెను. అట్లుబోధిసత్త్వుఁడు తనశిష్యునిఁబం
పి పిమ్మటఁగొంతతడవిట్లు చింతించెను. 'ఏనిపుడిట్లు దీని యా
హారమాంసమును వెదకుటకై యజితునంపుట యవివేకము.
అతఁడన్వేషించినను దప్పకలభించునని చెప్ప వలనుపడదుగదా!
పరులకుపకరించుటకై పరమేశ్వరుఁడొసంగిన యీశరీరమునేల
దీనికాహారము చేయఁగూడదు? అరయనరయ నీదేహమనిత్య
ము, సారవిహీనము, దుఃఖభాజనము, నపవిత్రముననుటకు సం
దియములేదుగదా! అట్టియీదేహమును బరోపకారమునకై
యుపయోగించుట పండితునకు వింతపనికాదు. అన్యులు దుః
ఖించుచుండుటఁజూచియుఁ దమసౌఖ్యమున కాటంకములగు

ననిగాని, తద్దుఃఖమును దొలఁగింపఁ జాలమసమర్థులమని గాని యాలోచించి గదా యుపేక్షింపవలయును. అన్యులదుఃఖమే నాసుఖమునకు విఘ్నకారి. కావున దీని దైన్యము నపనయింపఁ జాలియు నుపేక్షింపనేల ? మఱియు నట్లు సమర్థుఁడనై యాపన్నుఁడగు క్రూరుని సైతము పేక్షించినచోఁ బిదప నేదో యొక పాపము చేసినటులఁ బరితపింపవలసివచ్చును. కావున నేటియొద్దు మానివలె భంగురమగు నాయీశరీరముచే శాశ్వత కీర్తికరముగ నిప్పులిని బుత్రవధమునుండియు, మరణమువలన నీవ్యాఘ్రశిశువును దప్పించెదను. మఱియుఁ గామక్రోధాదులను విడిచి సత్పురుషుల కానందమును, స్వార్థపరులకు లజ్జయుఁ గలుగునట్లు నాయీశరీరముతోఁ బలువిధములగు లోకోపకారము లొనర్చి యెప్పుడు ధన్యుఁడ నయ్యెదనో యనుమనోరథము నాకుఁ జిరకాలమునుండియుఁ గలదు. దానినిపు డీడేర్చుకొనియెదను గాక యని నిశ్చయించి సురలు సైతము మెచ్చెరువడునట్లు తనశరీరము బెబ్బులియాహారమునకై విడిచెను. పిమ్మట సడి నెఱింగి యాయాఁడుపులి బోధిసత్వుని శరీరత్యాగమునకు మిక్కిలి యద్భుతానందము లొదవఁ దనతనయులను దినుటమాని, వ్యాఘ్రమునకుఁగల ప్రసూతిసమయస్వభావమును విడిచి, కన్నులు తెఱచి బిరబిరం జని గతజీవితమగు నాబోధిసత్వుని శరీరమును గాంచి దానిని భుజింప నుద్యమించెను. అనంతరము మాంసమును వెదకఁబోయిన యాతనిశిష్యుఁడు విఫలమనోరథుఁడై మరలి తన యుపాధ్యాయు నరయుచు రా నొకచో నప్పులి కాహారమై గతజీవితమగు గురుని కళేబర మాతనికంటఁ బడియెను. అజి



తుఁడును దనగురువర్యుని దుష్కరకృత్యమునకు మిగులవగలం జొగిలి విస్మయపరవశుఁడై యెట్టకేలకుం దెలివిగని యిట్లు చింతించెను.

ఆహా ! ఏమి యీమహాత్ముని పరదుఃఖాసహన మాత్మసుఖమును సైత మభిలషింపకుండెనే! మహాత్ములు కేవలకీర్తికాములై యెట్టికష్టకార్యములకును వెనుదీయరుగదా ! మఱియు నీమహానీయుఁడు తనకుఁగల గుణప్రియత్వమును బూర్తిగ వెల్లడించెను. ఇతఁడు జగదేకవంద్యుఁడు. ఇతనిజీవితమే జీవితము. కావున నీతనికై యింతచింతింపఁబనిలేదని కృతనిశ్చయుఁడై సర్వభూతశరణ్యుండును, నతిదయాళుండును నగు బోధిసత్వుని బలువిధముల సంస్తుతించుచు నీవృత్తాంతము నెల్లఁ దనసహాధ్యాయుల కెఱిఁగించెను. అదివిని వారెల్లరును మిక్కిలి యాశ్చర్యపడిరి. దేవతలు పుష్పవర్షముం గురిపించిరి. వెనుకటి జన్మములందు సైతము, నకారణవత్సలుఁడని ప్రసిద్ధి నొందిన యీబోధిసత్వుని నాఁటినుండి దేవునిఁగా భావించుచు జనంబులీతని చరిత్రములను బొగడుచుండిరి.

ఇట్లు మొదటిదగు వ్యాఘ్రజాతకము ముగిసెను.

## 2-వ కథ. శిబిజాతకము.

ఓసహపాఠకులారా ! మనకై యీమహనీయుచే గొప్పధర్మములు ప్రదర్శింపఁబడియెను. వానిని వినుండు. ఇతఁడు బహుకాలము శ్రమంపడి మిక్కిలిపుణ్యవంతుఁడై తత్పుణ్యవశమున శిబిదేశముల కధీశుఁడగు నొకరాజోత్తమునకుఁ బుత్రుఁడై

జనించెను. అట్లుజనించి తనచిన్ననాఁటనుండియు వృద్ధసేవా తత్పరమతియై క్రమక్రమమున నాధిపత్యము వహించి ప్రజ లనురక్తులై తన్ను సేవింప శక్తిత్రయ సంపన్నమగు రాజనీతి ననుసరించి నిజప్రజలఁబోలెఁ బ్రజలనేలుచుండె. మఱియువా నికిఁ త్రివర్గమును బరస్పరవైరము నుజ్జగించి వశమైయుండెను వివేకహీనుల గర్వమును, బాపుల యాపదలను, నల్పుల పాన పారవశ్యమును బోలి వానిసిరులు మితిమీఱి విజృంభించి యుం డెను. అతఁడు ప్రతిదినము తనచేసభీప్సితార్థసిద్ధివడసి సంతు ష్టులగు యాచకుల ముఖసందర్శనముచేఁ బరమానందమొందు చుఁ గాలమును గడుపుచుండెను. ఇట్లుకొంతకాల మతిక్రమిం ప నాతఁడు క్రమముగ నభ్యాసాతిశయముచే విద్యవలె దినదిన ప్రవర్ధమాన వితరణశీలుండై తననగరమునెల్ల ధనదానశాలా మయంబుగ నొనర్చి కృతయుగమేఘంబులు నాస్వర్ణంబులు వర్షింప మొదలిడెను.

అతఁడట్లు బద్ధదానకంకణుండై యర్థులమనోరథంబు లీడేర్చుచు, నన్నార్థులును, వసనాభిలాషులును, శయనకాము లును, నెవ్వరెయ్యదికోరుదు రయ్యదితప్పక వారికొసంగుచు నెల్లరునుదన్నుఁ బొగడుచుండఁగీర్తికాముఁడైతన పేరినెల్లదిశల వ్యాపింపఁజేసెను. అతనిదాతృత్వమును వినినవారెల్లరును దేశ దేశములనుండి గొప్పచెఱువునీటికైవచ్చు నడవియేనుఁగులవలె మందలుమందలుగా రాసాగిరి. తమతమకోర్కె లేదాతవలన నఁ దీరకుండుటకుఁ గొంతవిచారమొందియుఁ బరమదాతయగు నీబోధిసత్త్వునివలనఁ దీరునని మిక్కిలి యుత్సాహపడుచు నుం



డిరి. అట్లుతన్నుదర్శించుటకై వచ్చిన యాచకులనెల్లఁ జిరకాల ము దేశాంతరములకుఁబోయి వచ్చినమిత్రులనువలె నతఁడ త్యాదరముతోఁ జూచుచు మేలుమాటలచేవారివారి కోర్కెల నెరవేర్చి, వారుపరిగ్రహించుట తనకుపకారముగ భావించు చుండెను. అందువలన గొప్పదాతయనుకీర్తి యాతనికి లభిం చెను. మఱియునతఁడు నానాఁటికి దానశాలల నభివృద్ధిపఱుచు చువచ్చెను. ఇట్లుండ నొకనాఁడా మహనీయుఁడు తనదాన శాలలకుఁబోయి యందుయాచకులెవ్వరును లేకుండుట కిట్లిం తయుఁ జింతింపఁజొచ్చెను. 'నేఁడునాదానశాలలలో నెవ్వరును యాచకులుగానరాకుండిరి. నాకిదిదుర్దినముగదా! నేనువట్టి ని ర్భాగ్యుఁడను. ఆహా! శిబిదధీచిమున్నగు మహనీయు లెంతటి యదృష్టవంతులోకదా! యాచకులు వారిశరీరములనుసైతము యాచించి తమతమ మనోరథములను. గొనసాగించు కొనిరి. అంతటిభాగ్యము నాయట్టిదురదృష్టవంతునకులభించునా? అని.

పిమ్మట నిట్టి తనయభిమతముతీరకుండుట తనమంత్రుల కెఱిఁగించెను. మంత్రులుమున్నగువారాతని యసాధారణ దా తృత్వమునకు మిక్కిలి భీతిల్లఁజొచ్చిరి. భూమిచలింపసాగెను. అందులకు సర్వజ్ఞుఁడగు నింద్రుఁడత్యాశ్చర్యమునొంది 'ఆహా! వీనిదాతృత్వమెంతయు. మేరమీఱుచున్నదే! తనశరీరము నె వ్వరును యాచింపగని యితఁడు మిక్కిలి చింతించుచున్నాఁడ'ని వానిదాతృత్వమునందలి సాహసమును బరీక్షింపనెంచి వృద్ధుఁ డు నంధుఁడునగు నొకబ్రాహ్మణుని యాకృతితో వానికడకుఁ బోయెను. అపుడు బోధిసత్త్వుఁడు పెద్దకొలువు తీర్చియుండెను.

వానిమంత్రులు వచ్చినయాచకులనెల్లఁ జూచి, మీలో నెవ్వరి కేమి కావలయునో యెఱిఁగింపుఁడని ప్రశ్నించుచుండిరి. యాచకులకీయఁదగు ధనకనకవస్త్రములు ప్రోగులుగాఁ బోయఁబడియుండెను. అచ్చటకొకవృద్ధబ్రాహ్మణుఁడుపోయి జయజయశబ్దపూర్వకముగ నాశీర్వదించి నిలువఁబడియుండెను. అప్పుడట బోధిసత్త్వుఁడును వానిని సగౌరవముగఁజూచి ఆర్యా! నీకోర్కెలనెఱిఁగింపుఁడు. ఇదేయిచ్చుచున్నాఁడనని యడిగెను. అపుడావృద్ధబ్రాహ్మణుఁడు ఓరాజా! నేనుమిక్కిలి దూరదేశమునుండి వచ్చితిని. ఎవ్వరేదిగోరిన దానినెల్లవారికిచ్చెదవఁట. నేనంధుఁడను. మఱియు వృద్ధుఁడను. కావున నాకోర్కెదీఱి నాయంధత్వము దొలంగునట్లు నీచక్షువు ప్రసాదించి నన్ను మన్నింపుము. కన్నులులేక జీవించుట మిక్కిలికష్టమను విషయమీవెఱుఁగనిదికాదు. కావున నాకొకనేత్రమైన దయచేయవేఁడుచున్నాఁడను. అనిమిగుల దైన్యముతో నాతనిఁ బ్రార్థించెను. అదివిని బోధిసత్త్వుఁడు నేఁటికిఁ దనమనోరథము సిద్ధించెనని యుప్పొంగుచు, అహా! ఈవృద్ధబ్రాహ్మణుఁడు నిజముగఁ గన్నులుకావలసి నన్నుయాచించెనా? లేక నాధైర్యమును బరీక్షింపనెంచి యిట్లుపలికియుండునా? అనివిమర్శించుచు వానితోనిట్లుపలికెను. ఓబ్రాహ్మణోత్తమా! నిన్ను నాకడకెవ్వరంపిరి? కన్నుపెకలించియిచ్చుట యసాధ్యముకదా! నాయెడ నెవ్వరికిట్టి యూహజనించెనో చెప్పుము. అనిన బ్రాహ్మణవేషధారియగు నాయింద్రుఁడు బోధిసత్త్వుని యింగితమెఱింగియు, ఓరాజా! నన్నుఁబంపినవాఁడెవ్వఁడైన నేమి?



ఆదేవేంద్రుఁడనుకొనుము. వెనుదీయక నాకుఁగన్నులొసంగి నీదాతృత్వమును ఫలింపఁజేసికొనుమని పలికెను. అదివిని బోధిసత్త్వుఁడు, ఓవిప్రోత్తమా! నేనువెనుదీయువాఁడనుగాను. నీవందులకు శంకింపకుము. మఱియు నీవునన్నొక కన్నుమాత్రముకోరితివిగాని నా రెండుకన్నులును నీకిచ్చుచున్నాఁడను పరిగ్రహింపుమని ధారాళముగాఁబలికెను. ఆతనిమంత్రులా సాహసదానప్రతిజ్ఞనువిని ఓరాజా! నీవుమిక్కిలి గొప్పదాతవు. అయినను ననుచితమగు నీచక్షుర్దానము మిక్కిలి నింద్యమైయున్నది. ఒక్క బ్రాహ్మణుని నిమిత్తము నీవంధుఁడవై కేవలమీవేయనినమ్ముకొనియున్న మమ్ములను, ప్రజలను దుఃఖముపాలుసేయుట న్యాయమనుకొంటివా? మిక్కిలియున్నతములగుమేడలు, నసంఖ్యాకములగుధనములు, బలిష్ఠములగు నేనుఁగులును నీకుఁగలవు. వీనిలోఁ గోరినవానినెల్లనిచ్చి యీబ్రాహ్మణునిసంతోషపెట్టుము; మేమువలదనము ఈవిషయమును నీవనుచింతింపుము. ఓరాజా! మఱియొకటివినుము. ఒకనికన్ను మఱియొకనికిచ్చు టెట్లుసాధ్యపడును? అంతియకాక దైవతమనఁదగు నీవృద్ధబ్రాహ్మణునకీదృష్టియు ననపేక్ష్యమని మా నిశ్చయము. ఇతఁడు సామాన్యవిప్రుఁడే యయినచో దరిద్రుఁడగు నీముసలిబ్రాహ్మణుఁడు ధనాదులనుగోరక నీచక్షువును గోరనేల? అదియైనగ్రహింపరాదా? యని పలువిధములగు హితోపదేశములచే వారింపఁజొచ్చిరి. అతఁడును వారి వచనములనువిని మృదుమధురముగా, ఓమంత్రులారా! ఇచ్చెదనని ప్రతిజ్ఞచేసియు నీయకుండుట మిక్కిలి పాపహేతువని పెద్దలు

చెప్పుదురు. మఱియు దైవతమనఁదగు నితఁడిట్లు నీచక్షువును
గోరనేల ? స్వయముగ సంపాదించుకొనఁజాలఁడాయని యందు
రేమోవినుఁడు. కొన్ని కార్యములు పెక్కుకారణములచేఁగాని
సాధింపఁబడవు. కావుననాయీపూనిక కడ్డంకులు చెప్పకుఁడు.
నాకీ సంపదలతోడను, నీతుచ్ఛభోగములతోడను బనిలేదు.
కీర్తిశరీరముతో సరియగునది మఱొండు లేదని వారినిసమ్మతిం
పఁజేసి మిక్కిలి ధైర్యముతోఁ దనకంటిజంటలో నొకటి భిషగ్వ
రులచేఁ బ్రమాదములేకుండఁ బెఱికించి యావృద్ధున కిచ్చెను.
దానినాముదుకఁడు తననేత్రస్థానమున నదికికొనియెను. అనం
తరమా వదాన్యశిరోమణి తనరెండవకన్ను సైతము వానికిచ్చె
ను. అందులకుఁ బౌరులును వానిమిత్రులును బంధువులును
మిగులవిషాదమునొందిరి. పిమ్మట నింద్రుఁడును బరమాశ్చ
ర్యపరవశుఁడై ఆహా ! ఏమివీనిధైర్యసాహసములు. ఇట్టియసా
ధారణదాతృత్వ మెందైనఁజూచితిమా? అని మెచ్చుకొనుచుఁ
గొంతదూరముచని, అయ్యో ! యిట్టిమహానీయునిఁ జిరకాల
ము క్లేశపెట్టుట తగవుగాదనితలఁచి యుద్యానమున మంత్రు
లతోఁగూడియున్న యాబోధిసత్త్వుని కడకు మఱల వచ్చెను.
బోధిసత్త్వుఁడును వానిసడిని గనిపెట్టి యావచ్చినవారెవ్వరని
యడిగెను. అంతటనాతఁడు, ఓరాజా! నేనింద్రుఁడను. నీకోరిన
వరములిచ్చుటకై వచ్చితిని. కోరుకొనుమని పలికెను. అది
విని ఓదేవా ! నీయనుగ్రహముచే నాకెందును గొదువలేదు.
అష్టైశ్వర్యములుగలవు. కానినేత్రములు లేకుండుటచేఁ గన్ను



లార యాచకులఁ జూడఁజాలకుంటిని. ప్రపంచమెల్ల శూన్యమై
యున్నది. కావున నాకుమరణమును బ్రసాదింపుము. అను
టయు నింద్రుఁడు, ఓరాజా! నీవు మరణమును గోరనక్కఱలే
దు. సత్పురుషులు సైతమొకప్పుడిట్టి దురవస్థలనొందుచుండుట
గలదు.కాని నేనొకండడిగెదను జెప్పుము. నీకీదురవస్థను గలి
గించినది యాచకులేగదా ? ఇంకను వారియెడ నీకీప్రేమయే
ల ? అని ప్రశ్నింపఁగా నాబోధిసత్త్వుఁడు ‘ఓదేవేశ్వరా ! ఏది
యెట్లైనను యాచకులయెడ నాకుఁబ్రేమచెడకున్నది. కావు
న వారిని దర్శించుటకై నాకొకనేత్రమైనదయచేయుము లేదా
మరణమునుబ్రసాదింపుము’ అనిపలికెను. అదివిని దేవేంద్రుఁ
డు వానిమనోనిశ్చయమునకును, బుణ్యచింతకును మెచ్చియొక
నేత్రమునొసంగెను. అనంతరమా బోధిసత్త్వుఁడు ‘ఓమహాను
భావా ! యాచకుఁడు నన్నొక కన్నుమాత్రమే యాచించెను.
వానికి రెండవకన్ను బుద్ధిపూర్వకముగ నొసంగితిని. కావున
నీకుచితమని తోఁచినయెడ నాద్వితీయనేత్రమును సైతము
ప్రసాదింపుము’ అనిసవినయముగ నింద్రునిఁ బ్రార్థించెను.
పిమ్మటఁ దత్క్షణమె యాతనికి రెండవకన్ను లభించెను. అం
దులకు సంతసించి దేవతలు పుష్పవర్షమును గురిపించిరి. ఇం
ద్రుఁడును మిక్కిలిసంతసించి ఓరాజా ! నీమనశ్శుద్ధి తేటతెల్ల
మైనది. నేనొసంగిన యీనేత్రములకు నూరుయోజనములం
దున్న వస్తువులనరయు సామర్థ్యమును సైతమొసంగితినని
పలికి తత్క్షణమే యంతర్హితుఁడయ్యెను. అనంతరమాబోధి
సత్త్వుఁ డాశ్చర్యపరవశులగు మంత్రులతోడను, బౌరులతోడ

ను గలిసి పురమును బ్రవేశించి యెప్పటివలెఁ గొలువుదీర్చి మంత్రులు మున్నగువారికి ధర్మమహాత్మ్యములను బోధించుచుఁ గాలమును గడపెను.

ఇట్లు రెండవదగు శిబిజాతకము ముగిసెను.

## ౩-వ కథ. శ్రేష్ఠిజాతకము

సత్పురుషులు ప్రాణాత్యయమగుననియు వెనుదీయక సత్పాత్రములు లభించునపుడు వారినాదరించి తమదాతృత్వమును వెల్లడింతురుగదా! అందులకొక యుదాహరణమును వినుండు. భగవదవతారమగు బోధిసత్త్వుఁడొకప్పుడు సమస్తవిద్యల నభ్యసించి సకలసంపదల నార్జించి వ్యవహారజ్ఞానము చేమించిన శ్రేష్ఠిపుత్రుఁడై జనించెను. అతఁడు మిక్కిలి ప్రాజ్ఞుఁడై సత్యవంతుఁడగుటచే రాజగౌరవమునకు సైతము పాత్రుఁడై యుండెను. మఱియు నావైశ్యోత్తముఁడు వచ్చినయాచకులకెల్ల లేదనక వారివారికోర్కెల నెఱవేర్చుచుండుటచే వాని కీర్తియు లోకముల వ్యాపింపఁ దొడఁగెను. ఇట్లుండ నొకనాఁడు శ్రేష్ఠి స్నానమొనర్చి చందనము పూసికొని భోజనమునకు సిద్ధపడియుండెను. షడ్రసోపేతములగు భోజనపదార్థములను వండితెచ్చి వంటవారు వడ్డించుటకు సిద్ధముగా నుండిరి. ఇంతలోఁ బుణ్యబుద్ధిగలవాఁడును, జ్ఞానియునగు ప్రత్యేకబుద్ధుఁడను నొకయాచకుఁడువచ్చి ద్వారదేశమును సమీపించి రెండుబారలదూరమున భిక్షాపాత్రముఁ బట్టుకొని నిలుచఁబడియుండెను. అంతలోనాతని మనోరథమునుదీర్చి పుణ్యము చూరఁగొనఁదలఁచియున్న శ్రేష్ఠిసంకల్పమున కంతరాయము గలిగింప



నెంచి, యముఁడా శ్రేష్ఠియాచకులనడుమ ద్వారముకడ, బెట్టిదులగుభటులతోఁ గ్రిక్కిఱియు నొకనరకమును గల్పించియుంచెను. శ్రేష్ఠియైయున్న బోధిసత్త్వుఁడు భిక్షార్థియై వచ్చిన ప్రత్యేకబుద్ధునిఁ జూచి తనభార్యతో, ఓసీ! ఈయభ్యాగతునకుఁ జాలినంత యాహారమును దెచ్చియిమ్మని చెప్పెను. అందులకామెయు వల్లెయని భక్ష్యాదులతో నింపిన పాత్రమొకటి పట్టుకొనివచ్చి ద్వారదేశమున మిక్కిలి భయముఁగొలుపు నరకమును గాంచి స్త్రీలకు సహజమగు భయముచే వెనుకకుమరలెను. అపుడు బోధిసత్త్వుఁడట్లు మరలివచ్చిన తనభార్యను జూచి 'ఇదియేమి? ఆఁకలిగొనివచ్చిన భిక్షుకున కాహారము నొసంగకయే మరలివచ్చితివి' అనిప్రశ్నించెను. అందులకామె గద్గదస్వరముతో జరిగినసందర్భము నెట్టిటో చెప్పెను. అదివిని బోధిసత్త్వుఁడు 'అహా! ఏమి మనమిచ్చు భిక్షను స్వీకరింపకయే ప్రత్యేకబుద్ధుఁడేగవలసివచ్చెనా? ఆయాహారపూరితమగు పాత్రమును నేనేగొనిపోయి, యిచ్చివచ్చెదను తెమ్ము' అని యాభిక్షుకుఁడు నిలిచియున్న ద్వారదేశముకడ కాహారపాత్రమును గొంపోయి యచ్చట మిక్కిలిభయముఁగొలుపు నానరకమును జూచెను. అట్లుచూచి విస్మితుఁడై నిలిచియుండఁగా, నా శ్రేష్ఠియింటిగోడనుండి భయంకరరూపముతో నొకమహాపురుషుఁడు వెడలెను. అతఁడు గతాయువులగు జీవుల జీవములనాకర్షించు యముఁడు. అట్లతఁడు నిజరూపముతోఁ బ్రత్యక్షమై యంతరాళమున నిలువఁబడి శ్రేష్ఠిహితము గోరువానివలె ఓగృహస్థరత్నమా! ఇది రౌరవమను మహానరకము. ఇది వం

చకులగు యాచకులొనర్చెడి ముఖస్తుతులకులోనయి చిరకాలమునుండి బహుప్రయాసపడి యార్జించినధనములనుసైతము వారికిచ్చి మోసపడి కుటుంబహాని యొనర్చెదు వారికిని, నట్టి యాచకులకును నివాసముగఁ గల్పింపఁబడినది. మఱియు నొకటి చెప్పెదవినుము. ధర్మమునకును, గామమునకును, మోక్షమునకును గారణమగు ధనమును మిక్కిలి వెచ్చించుట పాతకహేతువనియు, వానికి నరకమెట్లును దప్పదనియు నీతిజ్ఞులు చెప్పుదురు. కావున నీవెఱ్ఱివెఱ్ఱిదానములనుండి నిన్ను మరలించుటకై వచ్చితిని. నీవలె నతివ్యయము చేసి దరిద్రులై తిరుగువారినిఁ గనుంగొనుము. అనివానిని దాతృత్వమునుండి మరలించు నుపదేశములను జేసెను. బోధిసత్త్వుఁడును వానియుపదేశమును దనయసాధారణ దాతృత్వమున కంతరాయముగ భావించి ఓమహనీయా! దానము తగదనియు నదినరకహేతువనియు నీవుచెప్పితివిగాని యిట్లెన్నఁడును నెవ్వరును జెప్పరు. దానముచేయనిధనము ధర్మమునకుఁ గారణముకాదని నాయభిప్రాయము కావున నాహృదయమునకుఁ గలఁతగలిగింపకుమని సవినయముగాఁ బ్రత్యుత్తరమిచ్చెను. పిమ్మట నయ్యముఁడు మఱియుఁ జెప్పఁదలఁచి ఓయీ! నీహితముకై చెప్పితినిగాని వేఱొండుగాదు. నీవును లెస్సగా నూహించుకొనుము. వెనుక విచారించిన లాభముండదుగదా యని పలువిధముల బోధించెనుగాని యాయమునియత్నమెల్ల విఫలమగునట్లతిసాహసమునఁ దనపూనికవిడువక బోధిసత్త్వుఁడు నరకమధ్యమునఁ బోవుచుండెను. అంతట నాతని పుణ్యవశమున నాతని కాలంబముగ



నందు స్థూలనాళమగు పద్మమొకటి జనించెను. బోధిసత్త్వుఁడది యవలంబముగఁ బోయి ప్రత్యేకబుద్ధునికి భక్ష్యపూరితమగుపాత్రమొసఁగెను. భిక్షుకుఁడును దనకుఁగలిగిన సంతోషమును వెల్లడించుచుఁ బలువిధముల స్తుతించి తనయావాసమునకుఁబోయెను. మారుఁడను నాయముఁడు తనకుఁగలిగిన యవమానమునకు లజ్జించి మరలవానిముఖమును జూడఁజాలనివానివలె నరకముతోఁగూడ నంతర్ధానమయ్యెను. బ్రాణాత్యయమగునని శంకింపక సత్పురుషులు సత్పాత్రములకుఁ బెట్టుదురు. మఱియుఁదాను తలంచిన సత్కార్యములు తుదముట్టువఱకును దమపూనికను విడువరు.

ఇట్లు మూఁడవదగు శ్రేష్ఠిజాతకము ముగిసెను.

## 4.వ కథ. శశజాతకము.

ఒక్కొకపుడు మహాపురుషులు కారణాంతరములచేఁ జతుష్పాజ్జంతువులుగా నవతరించినను దయయౌదార్యాది సద్గుణములను విడువరు. అందులకొకకథనుదాహరించెదను వినుండు. మున్నొకదేశమున నొకగొప్పయడవి యుండెను. అదిచక్కనితీగెలును, బలువిధములగు పూలచెట్లును, ఫలవృక్షములును, నిర్మలోదకములుగల నదులునుగలిగి యెల్లప్రాణులకు నివాసయోగ్యమైయుండెను. అందుఁ బవిత్రములై దట్టములగు నీడలచే సుఖకరములగు చోటులందుఁ బర్ణశాలలను నిర్మించుకొని కొందఱుమునులు తపమొనర్చుకొనుచుండిరి. ఆయరణ్యమున బోధిసత్త్వుఁ డొకశశరూపముతో నుద్భవించెను.

అల్లవతరించి శరీరబలముచేతను వన్నెచేతను మిన్నయై తాన
ల్పజంతువయ్యును గుణములచే మిక్కిలిమృగములనులెక్కిం
పక సింహముపిల్లవలెఁ జరించుచుండెను. అట్లుండ దానియుత్త
మ గుణములకు సంతసించి తక్కినకౄరజంతువులు సైతము
దానినొక శశచర్మమును గప్పికొని చరించుమునిగా భావించు
చు దానియెడఁ దమ కౄరత్వమునువదలి శిష్యులవలెఁ దిరుగు
చుండెను. మఱియు నామృగకులములో నాశశరాజు సుగుణ
గణంబులకువలచి బంధువులును మిత్రులును సహాయులునై
యొకనీరుపిల్లియు నొకనక్కయు నొకక్రోఁతియును దానినివిడువ
క తిరుగుచుండెడివి. అవి తిర్యగ్జంతువులయ్యును భూతదయ
యు సద్యశోభిలాషయును గలిగి దేవతలకుసైతము పొగడఁ
దగియుండెను. ఇట్లుండ నొకనాఁడు ధర్మవాక్యములను వినుట
కై యాశశరాజునొద్దకా వానరాదిమిత్రులు వచ్చియుండిరి.
అదిసాయంసమయమగుటచేఁ దూర్పునఁ జంద్రోదయమగు
చుండెను. ఆనాఁటిచంద్రుఁడు పూర్ణబింబముగలిగి సూర్యు
నకు దూరముగనుండుటచేఁ గాంతిమంతుఁడై వెండియద్దమువలె
నగపడుచుండెను. అపుడు సమీపించియున్న తనమిత్రులతో
బోధిసత్త్వుఁడిట్లు ప్రసంగించెను. ఓసహాయులారా! రేపుపౌ
ర్ణమియని మీరెఱుఁగుదురుకదా? పౌర్ణిమా వ్రతమును
జరుపదలఁచియున్న మీరు న్యాయార్జితమగు నాహారమును
సంపాదించి దానిలోఁగొంత యతిథిసత్కారమునకై వినియో
గింపుఁడు. మఱియు నేనొక్కటి చెప్పెదనువినుండు. ఆయువు
నీటిబుగ్గవంటిది. కావున గీర్తికిని బుణ్యమునకును సాధనమగు



దానముచేయుట శ్రేయస్కరము. దానముచే దరిద్రులగుదు
రని కొందఱు భయపడుదురుగాని యదియసత్యము. చెలమ
లందు నీరుతోడినకొలఁదిని మంచినీరూరుననియు లేనిచో నది
త్రాగుటకనర్హమై చెడుననియు మీకుఁదెలిసినదేకదా! మా
ణిక్యము సానఁబెట్టినకొలఁదిని హెచ్చుకాంతి వహించుననుట
మీకుఁ దెలియనిదికాదు. కావున న్యాయార్జితమగు ధనము
బీదలకిచ్చుటమేలు. అనవుడు నీరుపిల్లిమున్నగు నాతనిసహా
యులామంచియుపదేశమును శిరసావహించి నమస్కరించి తమ
తమనివాసములకుఁ బోయిరి. పిమ్మట నాశశరాజును దనయిం
టికివచ్చిన యతిథులకుఁ దగినయాహారమును సంపాదించుటకై
యత్నించియు, దంతములబలిమి చాలనందులకు మిగుల వగ
చుచుఁ దనజీవితము వ్యర్థమని చింతించుచుండెను. ఇంతలో
నాతనియౌదార్యమున కనుగుణముగ నొకయూహ జనించెను.
ఆహా! నేనిట్లులతిథిసత్కార విషయమున నసమర్థుఁడనని చిం
తింపనేటికి? నాయీశరీరము నతిథులకేల సమర్పింపఁగూడదని.
పిమ్మట తనశరీరము నతిథులకాహారముగ నీయఁదలఁచి మ
హానందముతో నుండెను. దేవతలీతని నిశ్చయము నెఱింగి
తమసంతోషమును వెల్లడించుచుఁ బుష్పముల వర్షించిరి.
అపుడందులకింద్రుఁడు మిక్కిలి యచ్చెరువొంది బోధిసత్త్వుని
మనోనిశ్చయమును దెలిసికొనఁదలఁచి యొకనాఁడు మట్టమ
ధ్యాహ్నమున బయలుదేరెను. దిక్కులనెండమావులు పెచ్చు
పెరిగి జీంకారధ్వనులు చెవుడు కొలుపుచుండెను. పక్షులు
మున్నగునవి యెండవేడిమిచే గిక్కురుమనక నీడలందడఁగి

మడఁగి యుండెను. అడవియెల్లఁ గీచుఱాలు కింగురుమని ధ్వనిచేయుచుండెను. మార్గస్థులలసటచెంది చెట్లనీడల నిదురింపుచుండిరి. అట్టిసమయమున నింద్రుఁడు బ్రాహ్మణవేషమూని త్రోవదప్పినవాఁడువలె శశము మున్నగునవి వినునట్లుగ దీనస్వరముతో ఓధార్మికులారా! ఈయడవి త్రోవను వచ్చుచుఁ దోడిసహాయులనుదప్పి, దప్పిచేమిగుల శ్రమచెందుచున్నాఁడను రక్షింపుఁడు రక్షింపుఁడని పలికెను. అప్పుడచ్చటనే యున్న తనసహాయులును దానునా బ్రాహ్మణవేషధారియగు నింద్రునిదీనారావమునువిని మిక్కిలికనికరముగలిగి యాతనిసమీపించి ఓబ్రాహ్మణోత్తమా! నీవు నీసహాయులను విడిచితినని విచారింపకుము. మేమునీశిష్యులము కావున మాసేవల నంగీకరింపుమని పలికెను. పిమ్మట వానిలో నీరుపిల్లి తమమిత్రుని మాటలఁ గాబ్రాహ్మణుఁడు బదులుచెప్పమిచే నాతనియంగీకారమును దెలిసికొని యెఱ్ఱచేపలను సవినయముగాఁ దెచ్చి ఓవిప్రవర్యా! ఈయేడుచేపలును దమ్ముఁబట్టినపుడు జాలరుల వలని భయముచేనెగిరి యొడ్డునఁజేరినవి; వానినినీకై తెచ్చితిని. సావకాశముగ భుజింపుమనెను. పిమ్మట నక్కయు నల్లయొక యుడుమునుదెచ్చి, యిదియేసంపాదింపఁ గలిగితిని; దీనినిస్వీకరింపుమని సమర్పించెను. తరువాత వానరము సైతము పండుటచేఁ గొంచెము మెత్తఁబడినట్టియుఁ బసుపువన్నెగలట్టియు మామిడిపండ్లనుదెచ్చి యిచ్చెను. పిమ్మట శశమావిప్రుని సగౌరవముగ సమీపించి వృద్ధుఁడనగు నాకీయడవిని దినుబండము లెవ్వియును లభింపలేదు. కావున నాయీశరీరము నర్పించు



కొనుచున్నాను పరిగ్రహింపుమని వినయముతోఁ బ్రార్థించెను. అప్పుడింద్రుఁడో శశరాజా! నేనెన్నఁడును నిట్టికృత్యమును జేసియెఱుంగను. నిన్నెట్లుభక్షించెదనని పలుకఁగా విని ఓబ్రాహ్మణోత్తమా! జంకవలదు. నేనునాశరీరము నగ్నితప్తముగ నొనర్చుకొనుచున్నానని శశముపలికెను. అదివిని మాయాబ్రాహ్మణుఁడచ్చటనే పొగలేనియొకమంటను గల్పించెను. శశరూపమును వహించియున్న బోధిసత్త్వుఁడామంటలోఁ దనశరీరమును బడవైచెను. అదిచూచి యింద్రుఁడాశ్చర్యపడి వానిని బలువిధముల నుతించుచుఁ దనలోకమునకుఁ గొనిపోయెను. వానినిజూచి దేవతలెల్లరును మిక్కిలి యానందమునొందిరి. పిమ్మట నింద్రుఁడును బోధిసత్త్వుని యద్భుతకృత్యమును లోకమున వెల్లడించుటకై యాతనిఁ జంద్రమండలమున శశరూపముతో నిలిపెను. నాఁడు మొదలు చంద్రునకు శశలాంఛనుఁడను పేరు గలిగియుండెను. మఱికొన్నినాళ్లకు బోధిసత్త్వుని సహాయులగు వానరములోనగునవియు నింద్రుని దయచే స్వర్గమునుబొంది సుఖముగనుండెను. ఇట్లు తిర్యగ్జంతువులు సైతము తమదాతృత్వముచే సద్గతినొందెననినచో మానవులకియ్యది కర్తవ్యమని వేఱుగఁజెప్పనక్కఱలేదుగదా?

ఇట్లు నాల్గవదగు శశజాతకము ముగిసెను.

## 5-వ కథ. మైత్రీబలజాతకము.

అహా! దయావంతులు పరులకు దుఃఖములు సంభవించునపుడు తమసుఖములనైనను బరిగణింపక వారికై పాటుపడు

చుందురుగదా! ఒకప్పుడు బోధిసత్త్వుఁడు ప్రజాపరిపాలనేచ్ఛ గలిగి సజ్జనులను రక్షించుటకును, దుర్జనులను శిక్షించుటకును సమర్థుఁడై మైత్రీబలుఁడను పేరితో మహారాజై జనించెను. మఱియు నతఁడు ప్రజలసుఖదుఃఖములను దనవిగాఁ దలంచుచు రాజులలో నెల్లఁ బేరువడసి ప్రవర్తించుచుండెను. అతఁడట్లు ప్రవర్తించుటఁజేసి యాతని దేశమునఁ గఱవొకప్పుడును సంభవింపకుండెను. ప్రజలందఱును సర్వకాలములయం దుత్సవములతో నిండియుండి యుపద్రవము లెట్టివియును లేక సుఖముగఁ గాలముగడుపుచుండిరి. ఇట్లుండఁగా నాతనిపాలనమున నొక తప్పుగలిగెను. అదిసందుచేసికొని కుబేరుఁడాతని దేశమును నశింపఁజేయుటకై తనసేవకులగు యక్షులను గొందఱ నంపెను. వారాదేశమందున్న ప్రజలలోఁ గలవరము గలిగించి వారియుత్సాహము చెఱుపనెంచి యాదేశమునఁ దిరుగుచు నందులకుఁ దగినయత్నముల నొనర్చుచు రావణసోదరుఁడగు తమప్రభువునకనుకూలురగు భటులమనిపించుకొనుచుఁ బ్రవర్తింపసాగిరి. కానియాదేశమునందున్న ప్రజల సామర్థ్యవిశేషమువలనఁ దామెన్నియత్నము లొనర్చినను యక్షులకోర్కె నెఱవేరకుండెను. అప్పుడు యక్షులు, ఆహా! ఈ దేశమునందలి ప్రజలశక్తి మిక్కిలి యద్భుతమైయున్నదే; మనముచేయు ప్రయత్నములన్నియు వ్యర్థములగుచుండెను. ఇచ్చట మనదేవత్వము వృథయై కొంచెమే నుపయోగింపకుండెనని తమలోఁ దామనుకొనిరి. మఱియు నాయక్షులు తాము బ్రాహ్మణవేషములఁబూని సంచరించుచునొకయడవిలో నొక



చెట్టునీడను జాతిపలకపైఁ గూర్చుండియున్న యొకగొల్లవాని జూచిరి. వాఁడు మెడలో నడవిపూలదండనొకటి వైచికొని కుడిభుజమున నొకగండగొడ్డలి తగిలించుకొని గొప్పపాటలుపాడుచు నొకత్రాటిని బేనుకొనుచు వారికగపడెను. యక్షులు వానిని సమీపించి, ఓయి! ఓయి! గొల్లతాతా! ఎవ్వరును లేని యీయడవిలో భయమువిడిచి యొంటరిగ నెందుల కిట్లున్నాడవని యడిగిరి. భయమెందులకని వాఁడు జవాబుచెప్పెను. అదివినివారు ఓరీ! యక్షులు, రాక్షసులు, పిశాచములు మిక్కిలి క్రూరకృత్యముల నొనర్తురని నీవువినియుండలేదా? భయమేలయని పలికెదవేమని మరలవానినడిగిరి. దానికివాఁడు కొంచెమునవ్వి, ఓబ్రాహ్మణులారా! సర్వసుఖములను గలిగించు నాయీశ్వరు ననుగ్రహముచే నిందు్రనకైనఁ జేరిచూడరాక నిర్భయముగ నీయడవి నిల్లుగాఁ జేసికొనియున్న నన్ను రాక్షసులేమి చేయఁగలరు? యక్షులేమి చేయుదురని వాఁడు మరల బదులుచెప్పెను. అదివిని ఓరీ! ఈశ్వరానుగ్రహముచేఁ బ్రాణభయము లేకుండుటెట్లని వారుప్రశ్నించిరి. అప్పుడా గొల్లఁడు, ఓవిప్రులారా! నేనుజెప్పిన యీశ్వరుఁ డెవఁడోయని తలంచుచున్నారు కాఁబోలును. పరమప్రభావవంతుఁడును దేజశ్శాలియు శత్రుభయంకరుఁడునునగు మాయీదేశపురాజే నాకీశ్వరుఁడు. ఆతనిప్రభావముచే నిట్లుభయములేక యుంటినని చెప్పి ఏమీ! మీరాతనిప్రభావము వినియుండలేదా? వినియుండి మీరా వచ్చికలుగలేదా? మఱియు నీదేశమునకుఁగల దుర్గములదాటివచ్చి నేఁటికినిఁ బ్రమాద [illegible] టయు,



మీయదృష్టవిశేషమనియే తలంచుచున్నాఁడను. మీరు మాయెలికప్రభావమును దెలియఁదలంచినచో నాతనికి నివాసమ్మగు పురమునకేగుఁడని నిర్భయముగాఁ బలికెను. యక్షులాగొల్లని ప్రసంగము సత్యమే యైనను, మిక్కిలి యసూయచేఁ బరితపింపఁజొచ్చిరి. సాధారణముగా నొకనికీర్తి మఱియొకని కనిష్టమై యుండుట వింతకాదుగదా! ఇట్లనియాయా పరువై యాకుబేర సేవకులా రాజు దాతలలో నగ్రగణ్యుఁడని పౌరుల వలనవిని వానినవమానపఱుపఁదలఁచి వానికడకుఁబోయి తమకాహారమొసంగుమని యాచించిరి. మైత్రీబలుఁడాయక్షులాతిథ్యముగఁ దన్నాహారమును గోరినందుల కెంతయు సంతసించి మంత్రులనుజూచి, ఓమంత్రులారా! ఈవిప్రోత్తములకు వలయునాహారములఁ బెట్టింపుఁడని సెలవొసంగెను. మంత్రులు దత్క్షణమే తమస్వామియాజ్ఞ ననువర్తించిరి. పిమ్మట నాకపటబ్రాహ్మణులామంత్రులు తమకుసమర్పించిన మనోజ్ఞమగు నాహారమును సైతమును దృణముగాఁజూచి తిరస్కారమును దెలుపు మందహాసములతో మాకీయాహార మిష్టపడలేదని యందఱునొక్కమాఱుగాఁ బలికిరి. అదివిని యాభూరమణుండు వారిని జేరి యెట్టిది మీకు రుచించునో సెలవొసంగుఁడు దానినిప్పుడే తెప్పించుచున్నాఁడనని పలికెను. అనంతరమా కపటవిప్రులు ఓరాజా! క్రొత్తలగు మనుష్య మాంసములు రక్తములు మాయక్షుల కన్నపానములనిపలికి వానికి నిజభయంకరాకారములతో నగపడిరి. అపుడా బోధిసత్త్వుఁడు కోరలచే వెలుపుగలిగించు వారిముఖములను బచ్చనికన్నులను వఱ్ఱకా



అపు మేఘములవలె నల్లనగు శరీరములనుజూచి ఆహా! వీరు బ్రాహ్మణులుకారు. పిశాచజాతిలోనివారై యుందురు. కావుననే వీరికి బ్రాహ్మణాహారమిష్టపడలేదు. ఎట్లైననేమి? వీరి యాకలిదీర్పవలయునుగాని వేఱుగనాలోచించుట యుచితము గాదని నిశ్చయించి, వారియెడ మిక్కిలిదయతో, అయ్యో! వీరికివలయు నాహారమాంసము నెట్లుసంపాదింపఁగలను? దీనికై పరులను హింసించుట పాడిగాదుగదా! స్వయముగఁజచ్చిన వారి మాంసము దెచ్చియిచ్చినను వీరిష్టపడరేమో? పేరాసతో నాహారమిమ్మనివచ్చిన వీరికీయఁజాలననుటయు నుచితము కాదుగదా యనిపలువిధములఁ జింతించుచుఁ దుదకుఁదనశరీరమునే వారికాహారముగా నీయఁదలఁచి వారితో, ఓమహనీయులారా! లోకహితముచేయుటకంటె నాయీశరీరమునకు మేలేమున్నది. 'పరోపకారార్థమిదంశరీర' మ్మను న్యాయమెల్లరెఱింగినదేగదా! అందులకే నేనీశరీరమును మోయుచుంటిని. కావున నాశరీరమాంసమును రక్తమును నన్నపానములుగాఁ గైకొనుఁడు. సందేహింపకుఁడని పలికెను. వారందుల కాశ్చర్యపడి వానిమనోనిశ్చయమును బాగుగ నెఱుంగ నెంచి, ఓరాజా! యాచకులు వారికోర్కెలను దమదైన్యమూలముననే యెఱింగింతురు; వారిమనస్సును గనిపెట్టుట దాతలదై యున్నదని పలికియూరకుండిరి. అపుడు మైత్రీబలుఁడును నాబ్రాహ్మణాకృతులగు యక్షులు తనమేనిమాంసము నాహారముగా నంగీకరించుట దెలిసి వైద్యులనురప్పించి తనరక్తమాంసములను గోసియిమ్మని యాజ్ఞాపించెను. ఈవృత్తాంతమునువిని మంత్రులు

వానినాదానమునుండి మరలింపనెంచి ఓభూపాలా ! మీకుహితము నుపదేశించునంతటివారము కాము. అయినను మాయాపునవినయొకటి మన్నింపుము. ఇదియంతయును గనిపెట్టఁగా మనదేశమును జెఱచుటకై యెవ్వరోపన్నిన పన్నుగడవలె నగపడుచున్నదిగాని బ్రాహ్మణులేమి ? పచ్చిమాంస మాహారముగా గోరుటేమి ? ఒకప్పుడీదానము తప్పదంటివా నీయాసేవకులమగు మాలో నొకరిమాంసమిచ్చి నీవీదానమునుండి మరలుమని పలువిధములఁ బ్రార్థించియుఁ దుదకు విఫలమనోరథులై యూరకుండిరి. పిమ్మట నాదానశూరుఁడు వైద్యులచేఁ దనమేనిమాంసము నొలిపించి యాకపటభూసురులకుఁ దృప్తికరముగనొసంగ వారుకడుపార నారగించుచుఁ గొంతవడికి నాతని ధైర్యస్థైర్యములకు మిగుల నబ్బురపడుచు, ఆహా ! ఈతని సత్యము ధైర్యము మిగులశ్లాఘనీయములై యున్నవే ! ఇతఁడు కేవలమనుష్యమాత్రుఁడై యున్నట్లగపడదని యానందించుచుఁ దాముతొలుత దురుద్దేశముతోఁ జనుదెంచియు మేలుచేయఁదలఁచి, ఓరాజోత్తమా ! నీధైర్య సాహసౌదార్యములకుఁ జాలసంతసించితిమి. ఇంకఁజాలును. నీవింద్రాధిపత్యమునే గోరికొనియెదవో లేక యింకేమయినఁగోరికొనియెదవో యెఱిఁగింపుము. నీకోరినవరమిచ్చెదమనిపలికిరి. అప్పుడుమైత్రీబలుఁడామాటలువిని, ఓయతులారా ! మీరు నాహింసకు సంశయించుచున్నట్లగపడుచున్నది. నామనః పూర్వకముగ నీదేహము సమర్పించితినిగాని వేఱొండుగాదు. కావునశంకింపకుఁడు. నాకింతకంటె వేఱుగుకోర్కెలు లేవనిపలుకుచుఁ దుదకు



దయఁదలంచిన వారిప్రతిబంధములపైఁ దానొకవరము కోరుకొనవలసి తనకు సర్వకాలములందును ధర్మమును విడువక ప్రవర్తించునట్టి బుద్ధిగలిగింపుఁడని వారినిగోరెను. పిమ్మట వారట్లేయగుఁగాక యనిపలుకుచు సంతర్ధానమొందిరి. దేవతలు పుష్పములవర్షించిరి. ఇంద్రుఁడందులకుఁ గారణమేమైయుండునని చింతించి తెలిసి మైత్రీబలమహారాజును దర్శించి యాతనిశరీరమును మునుపటికంటె మిన్నగనొనర్చి యాతనిచేఁబూజితుఁడై తననివాసమునకుఁ బోయెను. మైత్రీబలుఁడును స్వర్గరాజ్యముకంటె సుఖతరమగు స్వరాజ్యమునేలుకొనియెను. సజ్జనులు పరోపకారపరులై కష్టములకుఁ దలలొడ్డియుఁ దుదకుసుఖములనందకమానరు.

ఇట్లు ఐదవదగు మైత్రీబలజాతకము ముగిసెను.

## 6-వ కథ. విశ్వంతరునిజాతకము.

ఉదారచరితుల చరితములనల్పబుద్ధులొకప్పుడామోదింపకుండుటయుఁ జూపట్టుచుండఁగా వారివలెఁబ్రవర్తించుట సంభవించునా ? దానివిషయమున నొకయుదాహరణము చెప్పెదము. సావధానచిత్తులరై వినుండు. జితేంద్రియుఁడును, పరాక్రమాదిరాజగుణ సంపన్నుఁడును, రాజ్యపాలనా సమర్థుఁడునునై సంజయుండనురాజు శిబిదేశమున కేలికయై యుండెను. బోధిసత్త్వుఁడాతని కొకపుత్రుఁడై విశ్వంతరుఁడను పేరితో రాజ్యపాలనావిషయమున యువరాజై యుండెను. ఇతఁడే శాక్యముని యని చరిత్రకారులు చెప్పుదురు. అతఁడు తండ్రినిమిం

చిన కొడుకను ప్రసిద్ధిఁగలుగునట్లుగాఁ బ్రవర్తించుచుఁ ద్యాగ
శీలుఁడని ప్రజలచేఁ గొనియాడఁబడుచువచ్చెను. కాని కాల
క్రమమున నాతనిదానము వ్యసనమనవలసినంతస్థితికి వచ్చెనని
మాత్రము కొందఱకుఁ దోఁపకపోలేదు. ఇట్లుండఁగా నొక
నాఁడాతఁడు తనచే నెలకొలుపఁబడిన యన్నసత్రము లెట్లుజరు
గుచున్నవియుఁ బరిశోధించుటకై తనపట్టపుటేనుంగునెక్కి
బయలువెడలెను. ఆయేనుఁగు మిక్కిలి యున్నతమైనదియుఁ
బెక్కుయుద్ధముల శత్రుసేనలను రూపుమాపి జయముగలిగిం
చినదియునై యాదేశపుఁ బ్రజలకు మిక్కిలి ప్రేమపాత్రమై
యుండెను. మఱియు నాయేనుఁగునెట్టులనైన నపహరింపవలె
నను సంకల్పముతో శిబిదేశములకుఁ బ్రక్కనున్న శత్రురాజొ
కఁడు ప్రయత్నించుచుండెను. మనశాక్యముని యన్నసత్ర
పరిశోధనము చేయుచుండఁగా నంతకమున్నే యాతనిదాన
శూరత్వమును దనచారులమూలమునవిని యాశత్రురాజు తన
ప్రయత్నము నేఁటికి సఫలమయ్యెనని సంతసించుచుఁ గొంద
ఱు బ్రాహ్మణులను బిలిచి, ఓబ్రాహ్మణులారా! మీరెట్టుల
నైన మీమీనేర్పులను జూపించి యువరాజగు శాక్యముని
నుండి యాగజశ్రేష్ఠమును బరిగ్రహించిరండని పంపెను. వా
రును దమసామికార్యమును దప్పకనెఱవేర్తుమను నిశ్చయము
తో బయలువెడలి విశ్వంతరుని దర్శనమునకై వేచియుండిరి.
విశ్వంతరుఁడాకాలమున నొకసత్రమును బరీక్షించుచుండెను.
అపుడా బ్రాహ్మణులు యువరాజగు విశ్వంతరుని దర్శించి పలు
విధములనాతనిఁ బొగడిరి. ఆతఁడును బ్రాహ్మణప్రియుఁడగుటఁ



జే వారినాదరింపఁదలఁచి వారికోర్కెనెఱిఁగింపుఁడని సెలవిచ్చె
ను. వారదియే తగుసమయమని యెంచి, ఓయువరాజా! మీ
దివ్యదర్శన మొనరించినవారు విఫలమనోరథులై యూరకపోఁ
గూడదు. మేమెల్లర మొకకోర్కెగలిగి వచ్చితిమి. అదిసరి
గాదనక మాయభీప్సితము నెఱవేర్పఁదగియున్నది. గావున నీవా
హనమగు నీయేనుఁగును దయచేయుము. మాకదియే పది
వేలని సంతసించెదమని తమకోర్కెను వెల్లడించిరి. అదివినిన
తోడనే యాయువరాజు కొంతచింతించియు వెనుదీయుట తన
కొక గొప్పలోపమని తలంచి వెంటనే యాగజమునుండి దిగి
దానిని వారికి మనఃపూర్వకముగా నర్పించెను. వారును దమ
కోర్కె ఫలించెనని యుప్పొంగుచు దానింగొంపోయిరి. ఆకా
లమునఁ దఱచుగా రాజులపరిపాలనా విధానము ప్రజలయను
మతిపై నాధారపడియుండెడిది. అపుడా విశ్వంతరుని దానవృ
త్తాంతమును వినినప్రజలలో గొప్పకలవరమొకటి పుట్టెను.
పిమ్మట నాశిబిదేశపుఁ బ్రజలందఱును బోయి యేకగ్రీవము
గా ఓరాజా! నీకొమరుని దానవృత్తాంతమును వినియుంటివి
గదా! మనకుద్రోహమును జేయఁదలఁచియున్న శత్రురాజు
నకు మనరాజ్యమును శత్రులనుండి కాపాడుచున్న గజోత్త
మము నొసంగెనఁట. ఇట్టివాఁడు యువరాజై యుండుట మన
దేశమునకుఁ గొంతహానిని గలిగించుననుటకు సందేహము
లేదుగదా! కావున నీవాగజోత్తమమును రక్షించుటకై తొలు
త యత్నించుచు నీకొమరుఁడు వెంటనే మనదేశమున్ వదలి
పోవునట్లాజ్ఞాపింతువని మేమునమ్ముచున్నారము. లేనిచోఁ మే

మెల్లరమీ దేశమునువిడిచి యిదేపోవుచున్నారమని తమయభి
ప్రాయమును స్పష్టపఱచిరి. వివేకములేని సామాన్యపామరజన
మునకుఁ దమపట్టుదలయే గాని మంచిచెడ్డ లెక్కలుఁ బడును ?
సంజయుఁడును దనప్రజల యభిప్రాయమును దెలిసికొని ఆహా !
పాశత్రువొనర్చిన మోసమునెఱుంగక నాపుత్రుఁడిట్టి యను
చితదానమొనర్చెను. ప్రజలయభిప్రాయ మందులకుఁ బ్రతి
కూలమైయున్నది. ఆగజోత్తమమును మరలఁ దెచ్చుట దుష్క
రము. ప్రజలనువిడుచుట రాజనీతికి దూరము. పుత్రునిఁ
బోఁదోలుటకు మనసొప్పదని చింతింపఁజొచ్చెను. ఇట్లు పుత్ర
వాత్సల్య మొకవంకకును బ్రజానురాగ మింకొకప్రక్కకును
లాగిపీడింపఁగా నాతని హృదయమప్పుడు డోలాయమానమై
మిక్కిలి చలింపఁజొచ్చెను. కాని యప్పటికాతఁ డేమియును జె
ప్పక, ఓపౌరులారా ! ఇప్పటికి మీరు వెడలిపొండు. ఇంకనిట్టి
దానము లొనర్పకుండునట్లు నాపుత్రునిమందలించెను. రేపటి
యుదయమే పైవిషయమును నిర్ణయించిచెప్పెదను. లేనిచో
మీరే నాపుత్రుని వెడలించి కొనుఁడనిపలికి యేమియుఁదోఁ
పక కానున్నది కాకతప్పదని యూరకుండెను. మరునాఁడుదయ
ము రాజాజ్ఞకై నిరీక్షించి పౌరులొకచోఁజేరి రాజు తనకన్న
కుమారునిఁ బురమునుండి వెడలిపొమ్మని స్వయముగఁ జెప్పుట
లెన్నఁడును బొసఁగవని కొందఱుపలికిరి. అట్లుగాదింకను గొం
తవడికు, నిరీక్షించి యుండవలసి యున్నదేమోయని కొందఱు
చెప్పిరి. సరిసరి యింకను మీకుసందియమేల ? రేపుచూచెద
మన్న మాటకు లేదని యర్థముకాదా ? మనమందఱమేకీభ



వించి యీయువరాజును దేశమునుండి పొమ్మనుటయే యుక్త
మని మఱికొందఱు సిద్ధాంతీకరించిరి.

ఇట్లుపౌరులు కొంతవడియాలోచించి తుదకాతని వెడ
లఁగొట్టుటయే నిశ్చయమని యాగజము నారోహించు మావ
టీనిఁ బిలిపించి, ఓయీ ! నీవు త్వరగాఁబోయి మావృత్తాంత
మును యువరాజున కెఱిఁగింపుమని చెప్పిరి. వాఁడు భయ
మును దొట్రుపాటును దన్నుముందునకుఁద్రోయ బిరబిరఁబో
యి గద్గదస్వరముతో ఓయువరాజా ! జరిగిన వృత్తాంతమిది.
నీవిప్పుడిట్లుచేయవలెనఁట యనిచెప్పలేక చెప్పెను. అప్పుడా
మావటీని మాటలు తనచెవిఁబడినంతనె కొంతచింతింపఁదగి
యున్నను గొండవలెఁ జలింపనిహృదయముతో ఓయీ ! పౌ
రులకునాయెడ నిట్టియభిప్రాయము గలిగెనా ? ఈశిబిదేశపుఁ
బ్రజలిట్లు నిస్సారులగుదురని నేనెన్నఁడుననుకొనలేదు. నేనిట్టి
దానముచేయుట యనుచితమా ? యాచకులువచ్చి తమదైన్య
మును వెల్లడించునపుడు దాతలు లాభనష్టము లాలోచించి
దానముచేయవలెనా ? సరి సరి, వారియభిప్రాయమును నాకం
త యనిష్టముకాదు. కావున వెంటనే యీదేశమును విడిచి
పోవుచున్నాఁడనని వెంటనేవానినంపి తనధర్మపత్నియగు మద్రి
యంతఃపురమునకుఁ బోయెను. అంతకుమున్నె కర్ణాకర్ణికగాఁ
దనపెనిమిటి వృత్తాంతమును వినియున్నదగుటచే మద్రియుఁ
గొంతవాడినముఖముతో భర్తనుజూచి యాతఁడట్లాకస్మికము
గా వచ్చుట యందులకేయని గళవళింపడుచుండెను. విశ్వాంత
రుఁడు చిన్నఁబోయియున్న తనభార్యతో జరిగిన వృత్తాంతము

చెప్పనెంచి ఓప్రియురాలా! నిన్నటిదినమునఁ గొందఱుబ్రాహ్మణులు నాకడకువచ్చి నా యేన్గునిమ్మని యాచించిరి వారిప్రార్థనలకు మనసుకరఁగి కాదనలేక యిచ్చితిని. అందులకుఁ బ్రజలుకోపించి మాతండ్రికిష్టములేకున్నను నన్నీ దేశమునుండి తొలఁగిపొమ్మని యేకగ్రీవముగా నుత్తరవుచేసిరి. కావున నేఁడపోవనమునకుఁ బోవలసి యిట్లువచ్చితిని. మఱియు నేనొక్కటి చెప్పెదనువినుము. నేనొసంగిన ద్రవ్యములను సుశీలురగు బ్రాహ్మణుల కొసంగుము. అత్తమామలయెడ భక్తిగలిగి వర్తింపుము. మనసంతతికేలోపము గలుగకుండ నరయుచుండుమని చెప్పెను. ఆమెయు నామాటలు కాలినసూదులవలెఁ దనచెవినిబడ మిక్కిలిదుఃఖించుచు ఓప్రాణనాయకా! నీవిట్లు పలుకుటతగవుగాదు. నన్నునుమీతోఁ గొంపోవుఁడు. నాకును వనవాసమొక దుఃఖకరముగాదని నానిశ్చయము. మఱియు నచటఁ దమసేవలంజేయుచు నుపచారికనైవర్తించెదను. తమకుఁ గందమూలములులోనగు నాహారములను దెచ్చియిచ్చుచు నాజన్మమును ఫలపత్రముగఁ జేసికొనియెదను. నా యీప్రార్థనమును మన్నింపుఁడు. మాఱుసెలవొసంగరని నమ్ముచున్నదానననిపలువిధములనాతనిఁ బ్రార్థించి తన ప్రయాణమునకు సమ్మతినిగోరెను. అందులకాతఁడెట్టకేలకంగీకరించి తనధనమునెల్ల యాచకులకొసంగెను. అప్పుడంతఃపురమున గొప్పకలకలము జనించెను. విశ్వంతరునియాపదకై యాచకులకెల్ల గుండెలుతల్లడిల్లఁజొచ్చెను. ఇట్లెల్లధనములు యాచకులవశపఱచి రథమునెక్కి యాతఁడు దారపుత్రిలతోఁ బుర



మునుండి బయలువెడలెను. కొందఱుభృత్యులాతనిపైఁగల యనురాగముచే వెంబడించిరిగాని వారినాతఁడు మరలించెను. ఇట్లుభార్యాపుత్రిలతో వెడలి యతఁడాపురమునకొకయోజనదూరమందున్న యడవికేగెను. అంతటఁ గొందఱు బ్రాహ్మణులు మార్గవశమునవచ్చి వానిరథాశ్వములను యాచించి తమమనోరథము నీడేర్చుకొని పోయిరి. పిమ్మట విశ్వంతరుఁడశ్వములులేకుండుటచే రథమును దానే యీడ్వఁదలఁచి సన్నద్ధుఁడు కాఁజొచ్చెను. అంతట నాయరణ్యమున సంచరించు మృగములరూపములవహించి నల్వురుయక్షులారథము నీడ్వఁబూనుకొనిరి. ఆహా! సజ్జనులకాపత్సమయములందు దేవతలు తోడ్పడుదురను పెద్దలమాట నిజమైనది. అనంతర మతఁడు ఓమద్రీ! చూచితివా? తపోధనుల సహవాసప్రబలముచే నీయరణ్యమునఁగల మృగములకునయితము పరోపకారబుద్ధిజనించినది. అనిసంభాషించుచుఁ బ్రయాణము చేయుచుండెను. అంతటనాత్రోవనకుమ వారికింకొక బ్రాహ్మణుఁడగపడి ఓరాజపుత్రా! నీవుమహాదాతవని విని వచ్చితిని. కావున నీవధిష్ఠించిన రథమునాకొసంగి నన్ను మన్నింపుమని యాచించెను. పరమదాతయగు విశ్వంతరుఁడాయాచకునకు లేదనఁజాలక తనరథము నిచ్చి వానిమనోరథము నీడేర్చెను. ఆవిప్రుఁడును సంతసముఁ బరమానందభరితుఁడై వెడలిపోయెను. పిమ్మట నాదంపతులు పుత్రునొకనిను బుత్రికనొకరును మెల్లఁగఁదీసికొని పోవుచుండఁగా నాచేరువున నొకకొండ యగపడెను. ఆకొండచేరువను నివాసయోగ్యమగు నొకతపోవనమునఁ బ్రవేశించి వనచరులు

త్రోవచూపఁగా నారాజకుమారుఁడు మిక్కిలి మనోహరమై
యింద్రకల్పితమనఁదగు నొకపర్ణశాలలో భార్యాపుత్రుల
తో నివసించియుండెను. అట్లాపర్ణశాలలో మద్రియొనర్చు
పరిచర్యలకును ముద్దులొలుకు పుత్రికాపుత్రుల మాటలకును
సంతసించుచు నాయరణ్యవాసమొక యుద్యానవనవిహారముగ
నెంచి యానందముతో నందుఁ బదునెనిమిది మాసములు గడ
పెను. అక్కాలమున నొకనాఁడు ఫలమూలములను దెచ్చు
టకై రాజపుత్రి సమీపారణ్యమునకుఁ బోయెను. విశ్వంతరుఁ
డు తనశిశువులను గాపాడుచుఁ బర్ణశాలయందుండెను. అం
తట నొకబ్రాహ్మణుఁడు ధూళిధూసరితములగు పాదములతో
మొగము చెమ్మటలుగ్రమ్మఁ గమండలువుదగిల్చిన దండము
కటి భుజముపైనుంచుకొని తనభార్యతోఁ గూడ మనవిశ్వంత
రుఁడున్న పర్ణశాలకు వచ్చెను. బోధిసత్త్వుఁడావిప్రునిఁ జూచి
ఆహా! ఎన్నిదినములకు యాచకులను జూడఁగలిగితిని. నేఁడు
మిక్కిలి సుదినమని యానందించుచు నాతని నెదుర్కొని తెచ్చి
కుశలప్రశ్నపూర్వకముగా వచ్చినప్రయోజనమడిగెను. కాని
యాబ్రాహ్మణుఁడు కొంతవఱకు లజ్జించినవానివలెఁ దనమనో
భీష్టము నెఱిఁగింపఁజాలక యూరకుండెను. మఱియు నాబోధి
సత్త్వుఁడు ఓదంపతులారా! మీవాంఛితమెద్దియో తెలుపుట
కై సంశయించుచున్నట్లున్నది. అట్టిసందియముతోఁ బనిలేదు.
తప్పక నెఱవేర్చెద నెఱిఁగింపుఁడని పలికెను. అంతట నాబ్రా
హ్మణుఁడొకసారి తనభార్య మొగముచూచి ఓరాజకుమారా!
మాప్రాక్తనకర్మవశమున సంతతిగలుగదయ్యెను. ఈముద్దు



లొలుకు శిశువులనుజూచి నాభార్య మిక్కిలి వాంఛపడుచున్నది.
కావున నాయీమనోరథమునీడేర్చి మమ్ము సంపుకువని మే
మునమ్ముచున్నారమని సవినయముగాఁ బ్రార్థించెను. అందు
లకతఁడు కొంతచింతించియు మఱిమఱియునావిప్రుఁడు ప్రా
ర్థించుటచేఁ గాదనఁజాలక యిచ్చెదనని సమ్మతించెను. పిమ్మ
టఁ దమ్మాబ్రాహ్మణునకుఁ దమతండ్రి దానమిచ్చుననువార్త
నెఱిఁగి యాశిశువులతి కరుణముగా నేడ్వసాగిరి. విశ్వంతరుఁ
డు వారిఁజూచి చాలజాలిఁబడి ఓవిప్రోత్తమా! నేనీశిశువుల
ను నీకిచ్చుటలో సందియములేదు. కాని యీవత్సలను గన్న
తల్లి ఫలమూలాదులను దెచ్చుటకీచేరువ కాంతారమునకుఁ
బోయియున్నది. ఆమెయుఁ గొలఁది కాలముననే వచ్చును.
నాయీశిశువుల మొగములామెకుఁజూపించి పిమ్మట నీకర్పించె
దను. కావున నామనవిని మన్నించి యీరాత్రి యిచటవిశ్రా
మించి ప్రేపుప్రయాణము చేయవచ్చునని సవినయముగాఁ బ్రా
ర్థించెను. అదివిని యాబ్రాహ్మణుఁడు ఓరాజకుమారా! నీ
భార్యవచ్చుదనుక నేనుండుట యుక్తమేకాని యామె యీకా
ర్యమునకు విఘ్నముగలిగించునేమోయని శంకించుచున్నాఁడ
నని బదులుచెప్పఁగావిని యావదాన్యశిఖామణి ఓబ్రాహ్మణో
త్తమా! నీవట్లు సంశయింపఁజనదు. ఆమె యీవిశ్వంతరుని
భార్యయైయుండ నీకట్టిసందియమేటికి? నీకట్టినమ్మకములేనిచో
వీరినిపుడేగొంపోవచ్చును. ఈవిశ్వంతరునినోట మాఱుమాట
లు రావని యాశిశువులనాతని కప్పగించెను. శిశువులావిప్రుని
తో నేడ్చుచుఁబోవుచుండిరి. బ్రాహ్మణుఁడాపిల్లలయేడ్పులను

లెక్కింపక నిర్దయుఁడై దోఁచుకొనిన ధనమువలె వడివడిలాగికొని పోవుచుండెను. పైనివచ్చిన బ్రాహ్మణులందఱును విశ్వాంతరుని దాతృత్వమును బరీక్షించుటకునచ్చిన యత్నులైయుండురుగాని బ్రాహ్మణులిట్టి క్రూరకృత్యముల కొడిగట్టుకొనరని చదువరులకుఁ దోఁపకపోదు. అంతట విశ్వాంతరుఁడు మిగుల ధైర్యవంతుఁడయ్యును బొరలిపొరలివచ్చు దుఃఖమునాపలేక యొడలుమఱచి పుడమిపైఁగూలఁబడి ఆహా చిత్తమా ! ఏలయిట్లు పరితపింతువు ? ఇచ్చివగచుట తగదని పెద్దలుచెప్పుదురుగదా యని పలువిధములవిలపించుచుఁగొంతవడిమూర్ఛపడియుండెను

చదువరులారా ; బిడ్డలనుగడుపాఱఁగన్న తల్లియింట లేనప్పుడు ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలను జేతులారమఱియొకనికిచ్చి తానొంటరిగా నరణ్యమునఁ బర్ణశాలలోనుండుట యాతనికెంతకష్టమైయుండునో మనమెఱుంగకపోము. పిమ్మట మనరాజకుమారుని ధర్మపత్ని తాఁబోయినకార్యము కొంతవిలంబమగుటకుఁ జింతించుచుఁ దనకానాఁడగపడిన దుశ్శకునములేమి కీడుమూడించునోయని తొట్రుపాటుతో నింటికిమరలెను. ఆమెయట్లుమెల్లగఁ బర్ణశాలసమీపించి యెప్పటివలెఁ దనపుత్రులెదురుగారాకుండుటకుశంకించుచు లోనికిఁబ్రవేశించి యందొకచోఁబడియున్న భర్తనుజూచి అయ్యో ! నానాథుఁడిట్లుపడియుండెను; పుత్రులగపడకున్నారు; వారెందైనదాగి యుందురా? యని నలువైపులవెదకుచుఁ గొంతసేపటికిఁ దెలివిఁజెందినభర్తనుసమీపించి పుత్రులెందున్నారని యడిగెను. విశ్వాంతరుఁ డామాటకు బదులు చెప్పఁజాల కూరకుండెను.



అందులకు మది కళవళపడుచు భూమిపైనొఱగెను. అపుడు విశ్వాంతరుఁడు తనభార్యనుమెల్లగఁదెచ్చి మెత్తనిగడ్డిపైఁ బరుండఁబెట్టి శీతలోపచారములచే సేదదేర్చి ఓసాధ్వీ ! చింతింపకుము. మనపుత్రులనొక విప్రుఁడుయాచింపఁగా దానమిచ్చితిని. కడచినదానికివగచుటతగదని మంచిమాటలచే నామెనోదార్పఁగా మది తనపుత్రులు దానమీయఁబడిరను పలుకుచెవిఁబడినతోడనే మిక్కిలి యాశ్చర్యానందములనొంది, మనోనాయకా ! అటులైన దీనికింతవిచారమేటికని పలికెను. ఆమెధైర్యమునకుఁబతిభక్తికిని దేవతలుమెచ్చుకొనిరి. ఇంద్రుఁడావిశ్వాంతరుని సాహసౌదార్యములకు సంతసించి యాతనిపుత్రులను సంజయమహారాజునొద్దకుఁజేర్చెను. తానొనర్చిన యన్యాయమునకుఁ బశ్చాత్తాపపడుచున్న సంజయుఁడును నాతనిప్రజలును విశ్వాంతరునిపుత్రుల నత్యాదరముతోనేలుచుఁ గాలక్రమమున విశ్వాంతరుని భార్యాసహితముగఁ దోడ్తెచ్చి శిబిదేశమునకుఁ బట్టముగట్టిరి. అతఁడునుగృతయుగధర్మములతోఁ జిరకాలము ప్రజలనుబాలించెను.

ఇట్లుఆఱవదగు విశ్వాంతరునిజాతకము ముగిసెను.

## 7-వ కథ. బ్రాహ్మణజాతకము

సజ్జనులు తమకువిహితములగు సదాచారముల నొకరి ప్రతిబంధమునఁగాక తమకువిధియనియే యాచరించుటసహజముకదా ! బోధిసత్త్వుఁడు మిక్కిలి పవిత్రచరిత్రము గలిగి

స్వధర్మాచరణముచేఁ దగుకీర్తిఁ గాంచి వినయవంతమగు నొక బ్రాహ్మణవంశమందు జనించెను. అతని బాల్యము మిగుల నద్భుతమై యానందకరముగ నుండెను. అట్లతఁడు శుక్లపక్షపుఁజంద్రునివలె దినదినాభివృద్ధినొందుచు జాతకర్మాదిసంస్కారములఁ గ్రమక్రమముగా నందినవాఁడగుటచే సానఁబట్టినరత్నమువలెఁ దేజోవంతుఁడై విద్యాధనమును గడించుటకై యొక గురువునాశ్రయింపఁబోయెను. అప్పటికాలమునఁ బండితులు తమకడకుఁ జదువవచ్చిన విద్యార్థులనాదరించి యాహారాదిదానములచే నుచితముగ విద్యలను నేర్పు నాచారము దృఢమై యుండెడిది. "గుణాః పూజాస్థానం గుణిషు న చ లింగం న చ వయః" అను నార్యోక్తిఁ జెప్పిన నా బోధిసత్త్వుని యుత్తమవంశమును విద్యలను గ్రహించుటందలి నేర్పును నట్టిచిన్నవయసునందును శాంతముమున్నగు సద్గుణములను జూచి యట్టిశిష్యుఁడు తనకు లభించినందుల కుపాధ్యాయుఁడు మిగుల సంతసించి యాదరించుచువచ్చెను. సుశీలము, విద్యాగ్రహపాటవముగల శిష్యుఁడు లభించుటకంటె నుపాధ్యాయునకు వేఱొండు లాభము లేదు గదా ! మఱియు బోధిసత్త్వుఁ డొక్కఁడే గాక యాయుపాధ్యాయునొద్ద మఱికొందఱు శిష్యులును జదువుకొనుచుండిరి. విద్యార్థులనెల్లఁ దనపుత్రులవలె మిక్కిలి గారాబముతోఁ జూచుచు నాయుపాధ్యాయుఁడు వారికి విద్యాదాన మొనర్చుచుండెను. ఇట్లు కొంతకాలము గడువ వివేకసౌశీల్యాదులను బరీక్షింపనెంచి యొకనాఁ డుపాధ్యాయుఁడు విశ్రాంతిసమయమునఁ దనశిష్యులందఱు నొకచోఁ జేరియుండఁగా నచటికి వచ్చెను.



వారును దన్నుఁ జూచి వినయముతో లేచి నిలువంబడియుండ నచట వారితోఁ దాను గూర్చుండి వారిశీలములను బరీక్షింపఁ దలఁచివచ్చినవాఁడగుటచే వారిని జూచి ఓ విద్యార్థులారా ! దారిద్ర్యము ధైర్యవంతునైనను సారవిహీనునిఁగాఁ జేయునని మీరును వినియుందురు గదా ! అట్లగుట నేనిప్పుడు చెప్పుకొనవలసి వచ్చినది. మీ యట్టి విద్యార్థుల కుపాధ్యాయుండనైయుండియు నేనిట్లు దరిద్రుఁడనై యుండుట మిక్కిలి శోచనీయమై యున్నది. కావున మీ మీ విశ్రాంతికాలములందు ధనము నార్జించి తెచ్చి యిండని వారిని గోరెను. వారును దమ గురువుపైఁగల భక్తిచే నుత్సాహపూరితులయ్యును నసమర్థులగుటచేఁ దగు ధనమునార్జింపలేకున్నను బిచ్చమెత్తి యథాశక్తిగఁ దెచ్చియిచ్చుచుండిరి. ఇట్లొకటి రెండు దినములు గడచెను. మఱల నొకనాఁ డుపాధ్యాయుఁడు వారిని సమీపించి ఓ వత్సలారా ! మీ గురుభక్తి కెంతయు సంతసించితినిగాని మీ రొసంగుచున్న యీ బిచ్చపుఁగాసుకవలన నా లోపమెన్నటికిని దీరదు. కావున మీ రింక శ్రమపడక యూరకుండుఁడు లేదా నా యీ లోపమును సహింపమందురేని యీ మీ ప్రయత్నమును ధనసంపాదనమున వినియోగింపుఁడు. అది మిగుల యుక్తమగునని నాకుఁ దోఁచెడినని పలికెను. అది విని శిష్యులు ఓ గురువర్యా ! మేము తెచ్చు నీయాహారమాఁకలిని మాత్రము పోఁగొట్టును గాని మీ ధనలోపమును దొలఁగింపఁ జాలదని మే మెఱుంగుదుము. అయినను బాలురమగుటచే నే యుపాయమును దోఁపక యిట్లొనర్చుచున్నారము. ఏదే నొక యుపాయ మెఱిఁగించిన దానినాచరించెదము. అంతి

యా కాని మీ ధనలోపమును గాత్రము సహింపఁజాలమని యేకగ్రీవముగాఁ బలికిరి. అప్పు డుపాధ్యాయుఁడా శిష్యుల పలుకులు విని ఓయీ! శాస్త్రములందు ధనార్జనోపాయములు పెక్కులగపడుచున్నవి. కాని యవి శరీరపాటవమును బట్టి యాచరింపఁదగినవి. నేను ముదుసలినగుటచే వానినాచరింప నసమర్థుఁడను. మీరు వానినంగీకరింతురా? యని శంకించుచున్నాఁడనని పలికెను. పిమ్మట నాకలార్థు లుపాధ్యాయునితో ఓ మహానీయా! అయుపాయమేదో యెఱిఁగించి మాచేఁ గలార్థిఋణమును తీర్పించి కొనుఁడని ప్రార్థించిరి. అప్పు డుపాధ్యాయుఁడో విద్యార్థులారా! మీరు నన్నిట్లు మిక్కిలి నిర్బంధించుటచే సచ్ఛీలురచేఁ గర్హింపఁదగినదియైన యీ యుపాయమును మీకుఁ జెప్పవలసి చెప్పుచున్నాఁడను. మీరు ప్రథమవయోవంతులైనంతమాత్రము ప్రయోజనము లేదు సుఁడీ! పనులయందుఁ బట్టుదల గలిగియుండవలయును. దరిద్రుఁడు స్వకుటుంబపోషణమునకై దొంగిలించియైన ధనమార్జింపవచ్చును. అందు మేలుఁకువ గలిగి వర్తించినచో ధనార్జనోపాయములలో నంతటిది మఱొండు లేదు. కావున మీ కది యిష్టపడినచో నా యుపాయముచే నా దారిద్ర్యమును దొలఁగింపవచ్చునని యూహించెదను. అందుఁ గల మంచిచెడ్డలను నాలోచింపవచ్చును. లేదా మఱేదేనుపాయముచే ధనమును సంపాదించి తెండని చెప్పి యూరకుండెను. కళ్ళెము విడిచిన గుఱ్ఱములవలె నాకలార్థులు గురువచనములైనను గర్హణీయములని యాలోచింపక మిక్కిలి యుత్సాహముతో నా యుపాధ్యాయునానతిని శిరసావహించిరి. బోధిసత్త్వుఁడు మాత్ర



మెంతయును ఖిన్నుఁడై యుండెను. మిక్కిలి గుణవంతుఁడు. గురుభక్తిగలవాఁడు. సహాధ్యాయులను సోదరులవలెఁ జూచువాఁడు దైవసముఁడగు నుపాధ్యాయుఁడు దూష్యమగు దొంగతనము చేయవచ్చునని యేకాక చేయవలెనని యుఁ గూడ సూచించెను. అందులకుఁ దనతోడి విద్యార్థులందఱు నంగీకరించిరి. వారితోఁ దనకును దగని పని చేయవలసివచ్చినది. ఇట్టి దుస్థితిలో నాతఁడెట్లు ఖిన్నుఁడుగాకుండును? పరేంగితజ్ఞుఁడగు నుపాధ్యాయుఁడు బోధిసత్త్వునిఁ జూచి 'వీఁడు తక్కిన విద్యార్థులవలె నుత్సాహము లేక ఖిన్నుఁడై యున్నాఁడే. కారణమేమై యుండును? ఎన్నఁడును వీఁడు నా యాజ్ఞనుల్లంఘించి యుండలేదు. కావున వీనికిదుష్కార్యమాచరింప మనసొప్పకున్నదని యూహింపవలసియున్నది' అనియాలోచించి యాతనిఁ జూచి, ఓవత్సా! నీ సహాధ్యాయులందఱును నా దారిద్ర్యమును సహింపక నా యీ చెప్పిన యుపాయముచొప్పున నాచరింప సంసిద్ధులైయున్నారు. నీజాడ చూడఁగా నే చెప్పిన యిప్పని నీకిష్టపడనట్లు కన్పట్టుచున్నది. నా యభిప్రాయము నిట్లు వెల్లడించినను నీ కిందుఁ దొందర కానరాకున్నది. నా వ్యసనము నీకంతనొప్పి కలిగింపలేదని యూహింపఁదగియున్నది. కారణమేమి? అని యడిగెను. పిమ్మట బోధిసత్త్వుఁ డుపాధ్యాయునితో ఓ మహానీయా! పాపము శాంతించుఁగాక నేనిట్లు వెనుదీయుట మీ మాటయందనాదరముచేఁ గాదు. తాము చెప్పినచొప్పరయ సందర్భశూన్యమై యున్నట్లు తోఁచి యిట్లంటిని. మఱియు వినుఁడు. ఎవ్వరికిని దెలియకుండ నే కార్యమునుజేయుట కెవ్వరికిని వలనుపడదుగదా! ఎల్లవారును

చేయుపనులందుఁ బంచభూతములును సాక్షులై చూచుచుండును. దివ్యజ్ఞానముగల మునులు సైతము మనుజులొనరించు పనుల నరయుచుందురు. ఎవ్వరును జూడని చోటులు లేవని నా నమ్మకము. కావున రహస్యముగఁ జౌర్యము చేయుట కెట్లు వశపడును? అని బదులు చెప్పి మఱియు నో యార్యా! తత్వజ్ఞులగువారును ధనప్రియమున నిట్లు తలంతురని నేనెన్నఁడును నమ్మఁగొనలేను. నా యభిప్రాయ మెఱిఁగించెదను వినుఁడు జీవికకై ధర్మహాని గలిగించు పనులొనరించుటకంటె దిగంబరుఁడై కపాలమును బట్టుకొని బిచ్చమెత్తికొనుట కొంత మేలని చెప్పెను. అది విని యుపాధ్యాయుఁడానందాశ్చర్యములతో నాసనమునుండి లేచి కౌఁగిలించుకొని వత్సా! నీమనశ్శుద్ధికి మిగుల సంతసించితిని. వివేకముగల నీయెడ నిదియొక యాశ్చర్యము గాదు. మూర్ఖులగువారించుక యవకాశము దొఱకినచో ధర్మమును విడువఁజూతురు. వివేకవంతులగు సజ్జనులు తమ కాపదలు తటస్థించినను దమ సత్ప్రవర్తనమునుండి తొలంగరు. ఓవత్సా! ఉత్తముఁడవగు నీచే నీ వంశము పవిత్రమైనది. మఱియు నీవును విద్యావంతుఁడవైతివి. కావున నిఁక నీ తలిదండ్రులకడకుఁ బోయి గృహస్థుఁడవై సుఖముగఁ గాలమును గడపుమని పలికి యాశీర్వదించి యింటికిఁ బంపెను. మన బోధిసత్త్వుఁడును గుర్వాజ్ఞానుసారముగ నింటికిఁ బోయి తలిదండ్రులను సేవించుచు సత్కర్మానుష్ఠానపరులగు గృహస్థులలో నొకఁడై ప్రసిద్ధిగాంచెను.

ఇట్లేడవదగు బ్రాహ్మణ జాతకము ముగిసెను.



## 8-వ కథ. సుపారగజాతకము.

ధర్మాత్ములును, సత్యవ్రతులును నగువారి కొకప్పుడాపదలు రాఁదగియున్నను మంచువలె నాయవి తుదకవి వారి లాభములకుఁ గారణమగుచుండును. ఒకప్పుడు బోధిసత్త్వుఁడు మిగుల ధనవంతుఁడగు నొకనావికునింట జనించి కాలక్రమమునఁ దానొక నావికోత్తముఁడై యుండెను. అతఁడే జన్మమందైనను సహజముగ బుద్ధిశాలియు గుణవంతుఁడును నగుటయే గాక తానెయ్యది యభ్యసింపవలసియుండునో దానిని సమగ్రముగ నేర్చి యందుత్తీర్ణుఁడై యందఱికంటె నెక్కువవాఁడను ప్రసిద్ధివడయుచు వచ్చెను. మఱియు నతఁడు మిక్కిలి ధనవంతుఁడయ్యును దనకుఁ గులవృత్తియగు నోడలు నడుపుటయే జీవికగాఁ జేసికొని నక్షత్రగతిభేదముల నెఱిఁగి దిగ్విభాగవిషయమున భ్రాంతినొందక యోడలకొకప్పుడు సంభవించు పలువిధములగు నాపదలను దొలఁగించుకొను నుపాయముల నెఱిఁగి యుండెను. ఓడలను నడుపవలసిన కాలములు, చేపలు, నీటిరంగు, నీటిహెచ్చు, పక్షులు, కొండలు మున్నగు గుఱుతులం బట్టి తెలియఁదగు సముద్రపుఁదత్వమును బాగుగఁ దెలిసికొని యుండెను. అతఁడోడలను నడుపుచుండెడి కాలముల నిద్రాహారముల జయించి మిగుల జాగరూకుఁడై శీతోష్ణవర్షాదులవలని క్లేశమును సహించి ప్రయాణము చేయువారికిని సామగ్రులకును నొకప్పుడును బ్రమాదము కలుగకుండ వలయు చోటులను జేర్చెడివాఁడని మిగులఁ బ్రసిద్ధివడసెను. అట్లు నిష్ప్రమాదముగ నోడలఁ దీరములఁ జేర్చుచుండుటచేఁ గాఁబోలు నాతనికి సుపారగుఁడను పేరు కలిగెను. అతఁడు నివసించిన పత్తనముగూడ

నా పేరితో వ్యవహరింపఁ బడుచువచ్చెను. కొండఱు దానినే సుపారగమనుచు వాడుచుండిరి. ఇట్లుండఁగా నొకప్పుడు మరుకచ్ఛ దేశస్థులగు కొందఱు బంగారువర్తకులు ఓడప్రయాణమును జేయుతలంపుతో నాసుపారగపత్తనమునకువచ్చి సత్త్వగుణసంపన్నుఁడగు నాసుపారగునిఁ దమకోర్కె నఱపుటకై ప్రార్థించిరి. అదివిని యతఁడు వారితో ఓవర్తకులారా! కాలము లోకులయాయువును జాపక్రింది నీటివలె నెవ్వరికెఱుకపడని మెలఁకువతో నాక్రమించి యపహరించుచుండుననువిషయము మనమెల్లర మెఱింగిన దేకదా! నాయవస్థ మునుపటి వంటిదనియే మీరు నాదరికి వచ్చియుంటిరి. నా దేహపాటవము కొంతతప్పినది. ఇట్టినేను మీకేమి సాయపడఁగలనని పలికెను. వర్తకులామాటవిని ఓనావికసార్వభౌమా! నీస్థితిని మేమెఱుఁగకపోలేదు. నిన్నిపుడొక పెద్దకార్యముచే నాయాసపెట్టవచ్చినవారముగాము. నీవీయోడపైఁ గూర్చుండుము. తావన్మాత్రమున నది జయప్రదముగా నొడ్డుచేరునని మానమ్మకము. కావున మామనవి నంగీకరించి యీయోడనలంకరింపుమని ప్రార్థించిరి. అతఁడును వారిమాటమీఱలేక యట్లేయని యొప్పుకొనెను. ఇఁకఁదమయాత్ర శుభప్రదముగ జరుగునని తలంచి వారు పరమానందభరితులైరి. ఆమఱుచటిదినమే ప్రయాణము జరిగెను. క్రమక్రమముగా వారు సముద్రములోఁ బ్రవేశించిరి. అచటఁ బలువిధములగు చేపలు భయంకరములగు చప్పుడులు చేయుచుండెను గాలిచేఁ దరంగములు నాట్యము చేయఁజొచ్చెను. పలురకములగు లోనిరత్నముల కాంతులు పైకివెడలుచున్నవో యనునట్లు సూర్యకాంతులతో సంక్ర



మించిన నురుఁగులు సముద్రమున కొకవిధమగు శోభనుగలిగింపఁజొచ్చెను. ఇంతలో సూర్యుఁడస్తంగతుఁడగుచుండెను. దిక్కులనువ్యాపించిన చీఁకటులు సముద్రజలమునకు నైల్యము హెచ్చించుచుండెను. ఇంద్రనీలములవలె నల్లనై సూర్యకిరణముల వేఁడిమిచేఁ గరఁగిన యాకసమునునట్లగపడి, యెవ్వైపుచూచినను దీరమగపడని సముద్రమధ్యప్రదేశమును వారు చేరికొనిరి. అట్లువారా సందెచీఁకటిలో నాసముద్ర మధ్యమునఁ బ్రవేశించి పోవుచుండఁగా నపుడు మిక్కిలి భయంకరమగు గొప్పయుత్పాతమొకటి జనించెను. పెద్దగాలులు విసరఁజొచ్చెను. ఆయుప్పెన గాలులచేఁ గదలు తరంగములచే నా సముద్రము ప్రళయకాలమునఁ జలించు కొండలతోఁ గూడిన భూమివలె వారికిమిక్కిలి భయము గొలుపుచుండెను. మెఱుపులను నాలుకలచే నల్లత్రాచు పాములవలె మేఘములు భయంకరములగు గర్జనములతో నాకసము నావరించియుండెను. సూర్యుఁడు కొండలచాటునకుఁబోయి సంపూర్ణముగ నగపడకుండెను. తన్నుఁగవియు పెనుచీకటులపైఁ గోపించుచున్నదన్నటుల ధారావర్షముచే సముద్రము మీఁదికుప్పొంగుచుండెను. ఆట్టిమహావర్షమునకు భయపడుచున్నదివోలె మన నావికులయోడ కంపింపఁజొచ్చెను. అపుడాయోడవర్తకులకుఁ గలిగినభయమునకు మేర లేదు. కాని, వారేమిచేయఁగలరు? మిక్కిలిభయముచే దీనులై నాస్తికులనఁదగువారికి సైతమాపత్కాలమున స్మరింపఁదగు నాపదుద్ధారకు నాపరమేశ్వరునిఁ బ్రార్థించుచుండిరి. కానియాయుప్పెన, యాయోడయందుండువారి హృదయముల నోడతోఁగూడ నలువైపులకుఁ

దిప్పుచుండెను. వారికెప్పటివలె సముద్రచిహ్నములు తెలియఁబడకుండెను. అందువలన వారుకొన్నినాళ్ళవఱకును దీరమును జేరలేకుండిరి. అపూర్వములగు నానాసముద్రచిహ్నములనుగాంచి దారవిత్తమగు వెఱపునొందసాగిరి. అపుడు మన సుపారగుఁడు తక్కిననావికులకు ధైర్యముకలుగునట్లుగా ఓనావికులారా! మహాసముద్రమధ్యమును బ్రవేశించునపుడొకప్పుడిట్టి యుప్పెనలు గలుగుచుండుట వింతగాదు. ధీరులు దైవవశమునవచ్చు నాపదలకు దైన్యపడక సహజమగు ధైర్యమునూఁగొని తమకుసంభవించిన కష్టములను దొలఁగించుకొందురు. కావున భయమునొందక కార్యసాధకమగు నేదేనుపాయము నాలోచింపుఁడనిపలికెను. అదివినివారు ఓనావికోత్తమా! ఇట్టియాపత్సమయమున నీపైనాధారపడియుంటిమనిపలికి యాతఁడొసంగిన ధైర్యదండమవలంబముగాఁ గొని సముద్రము నలువంకలఁ జూచుచుండిరి. అపుడువారికి వెండికవచములను దొడిగికొనివచ్చు యోధులవలె మునుఁగుచుఁ దేలుచుఁ గొన్ని పురుషాకృతులగపడెను. వానినివర్తకులుచూచి యాశ్చర్యముతో ఓనావికోత్తమా! చూచితివా? ఎవ్వరోరాక్షసులు వెండికవచములను ధరించి భయంకరాకారములతో నిందుజలక్రీడ లొనరించుచున్నారు. ఇది యపూర్వమై కనుపట్టుచున్నదని సుపారగున కెఱిఁగించిరి. అతఁడు ఓనావికులారా! మీకగపడినపురుషాకారములు రాక్షసులును మనుష్యులునుగారు. అవిగొప్పమత్స్యములు. వీనికిభయమందకుఁడు. మఱియు నొకటి చెప్పుచున్నాఁడను వినుఁడు. మనమిప్పటికి రెండుపట్టణములను దాటితిమి. ఖురమాలియను సముద్రమునఁ బ్రవేశిం



చితిమి. మనకిదితోవగాదు. కావునదీనినుండి మనయోడను మరలించుటకై ప్రయత్నింపవలెనని చెప్పి దానిని మెల్లగమరలనడపుచుండెను. అటులఁ గొంతదూర మేగువఱకు నచట మఱియొకసముద్రమగపడెను. అదిమిక్కిలి తెల్లని నురుఁగులతో నిండియుండెను. దానిని వారెన్నఁడును జూచియుండమిచే నాశ్చర్యపడి యిదియేసముద్రమని సుపారగునడిగిరి. అతఁడు ఓనావికులారా! మనముచాలదూరము వచ్చితిమి. దీనికి దధిమాలియనిపేరు. దీనిఁజొచ్చితిమేని మనమీయోడను మరలించుట కష్టమని సుపారగుఁడు తక్కినవారితోఁజెప్పెను. అదివిని యాయోడవర్తకులు ఓనావికోత్తమా! ఇఁకవిలంబముచేయవలదు. మఱలఁ బ్రతికూలవాయువులు విసరినచోఁ బ్రమాదము వాటిల్లును. కావున నుపాయముచే నీయోడనుదప్పించి మమ్మీయపాయమునుండి యుద్ధరింపుమని ప్రార్థించిరి. పిమ్మట వారాసముద్రము నాతనికౌశల్యముచేదాటి యగ్నిమాలి కుశమాలి మున్నగుసముద్రముల నతిక్రమించి పోవుచుండిరి. వారెన్నిప్రయత్నము లొనర్చినను నాయోడ సరియగు త్రోవను బడకుండెను. అంతలోఁ బిడుగులు పడుచున్నట్టులును వెదురుపొదలంటుకొని మండుచున్నట్టులును నొకచప్పుడు వారికి వినవచ్చెను. దానికాయోడవర్తకులు మిగుల వెఱపుచెందిరి. అచట సముద్రోదకము పైకెగిరి గుహవలె మిక్కిలి లోతగు ప్రదేశమునఁ బడుచుండుట వారికిఁగానవచ్చెను. దానింజూచి వర్తకులిదేమని యాతనిఁబ్రశ్నించిరి. అపుడా నావికోత్తముఁడగు బోధిసత్త్వుఁడు ఓవర్తకులారా! మనకునేఁడు చాలఁబ్రమాదము వాటిల్లునని తోఁచెడిని. ఇది బడబాముఖము. ఈ

బడబాముఖము నావికులకు మృత్యుముఖమనుటకు సందియము లేదని చెప్పెను. అపుడావర్తకుల వదనాకాశములనుండి సముద్రఘోషముతో రోదనధ్వనులు వెలువడఁజొచ్చెను. వారిలోఁ గొందఱు ప్రాణములకై యాశవిడిచి నిశ్చేష్టులైయుండిరి. కొందఱు సూర్యునిమఱికొందఱింద్రాదిదిక్పాలురను స్తుతింప మొదలిడిరి. కొందఱు సముద్రునే ప్రార్థింపఁజొచ్చిరి. ప్రత్యక్షదైవమువలె నగపడు నాసుపారగునే మఱికొందఱు శరణు జొచ్చిరి. అపుడచటఁబుట్టిన కలవరమిట్టిదని చెప్పుటకు వలను పడదు. ఆవర్తకుల దైన్యమా సుపారగుని యధైర్యమును మఱింత హెచ్చించుచున్నను, సహజధీరుఁడును, వివేకవంతుఁడునగు నాతఁడు బెగులువడక కొండవలె నిశ్చలుఁడై, దయారసముట్టిపడునట్లుగా వారితో ఓసాంయాత్రికులారా! ధైర్యమువలంబింపుఁడు. మనకు భగవంతుఁడు సాయపడక పోఁడు. ఈయాపదకుఁ బ్రతీకారమొకటి స్ఫురించుచున్నది. దానినిపుడుపయోగించెదను. రెండుగడియ లూరకుండుఁడని పలికెను. వారును గొంత ధైర్యముగలిగి యాతనియత్నమునకుఁ దోడ్పడుటకై పరమేశ్వరునిఁ బ్రార్థించుచుండిరి. అనంతరమా సుపారగుఁడగు బోధిసత్త్వుఁడు బుద్ధదేవునిధ్యానించి యుత్తరీయము నడుమునకు గట్టిగబంధించి మోకాలిపైఁగూర్చుండి 'నా ప్రయత్నమును బుద్ధుఁడు ఫలింపఁజేసి యీదీనులను రక్షించుఁగాక' యని వేడికొనుచు ఓవర్తకులారా! భయముచెందకుఁడనిపలికి, సముద్రాశ్రయులగు దేవవిశేషులారా! 'నేనాత్మరూపియగు దేవుని భజించువాఁడనేని, యసత్యమెన్నఁడును బలుకనివాఁడనేని, నాయీయుద్యమము ఫలించి యీయోడ



బడబాముఖమునుండి మరలుఁగాక' యనిపలుకుచు నావోడను మరలించెను. అంతకుమున్నా యుపాయశాలి యూరకుండెనా? లేదు. కానిసుఖకాలమురాలేదు. దైవము తోడ్పడు కాలము తటస్థించునపుడెట్టిగట్టి యిక్కట్టులును సల్పముగ నుపాయముచేఁ దూలములవలెఁ బటాపంచలై నశించుట వింత కాదుగదా! ఆనావికోత్తముని సత్యపుబలిమియో లేక పుణ్యంపుఁగలిమియో గాక యాతనియిష్టదైవము చెలిమియో చెప్పఁజాలముగాని యనుకూలవాయువుచే బడబాముఖమునుండి యాయోడ యొకనిముసములో మరలి మార్గమునఁబడెను. ఆవర్తకులు తమపాలింటి దైవమే మారుతిరూపమునవచ్చి తమ్ము రక్షించెనని తలంచిరి. ఆసారి యాత్రలో వారికి రానున్న యాపదను దప్పించుటకై వారికులదైవమే సుపారగరూపమున వచ్చెనని మనమూహింపవచ్చును. ఆవర్తకులు సుపారగునిఁ బలువిధములనుతించిరి. తక్కిననావికులును సుపారగుని చాతుర్యమునకు మెచ్చుకొనిరి. ఓడయంతయు సంతోషరావములతో నిండియుండెను. ఆమహాసముద్రమున నాయోడ, మేఘములు చెదరుటచే నిర్మలమగు నాకాసమున రాజహంసవలె నెంతయు వెలయుచుండెను. అట్లుమరలి యానావ విమానమువలె విలాసగమనముతోఁ బోవుచుండెను. కొంచెము మెఱుఁగుతఱిగిన సందెయను రంగుపూతచే దిక్కుడ్యములు వెలయుచుండెను. మున్నావరించియున్న మేఘములు మననావికుల యాపదతోఁ బాటుగ నంతరించిపోయెను. ఆకసమును నీలిఛాదినికలంకరించిన ముత్తెములవలె నక్షత్రము లలరారుచుండెను. అపుడావర్తకుల లాభమునుగోరు నానావికోత్తముఁడు ఓసా

ర్థవాహులారా! మనకిప్పుడు మతలల నగవడు నీలమాలి మొదలగు సముద్రములనుండి మనయోడ మోయఁగలుగు నంతటి యుసుకను పాషాణములను నిండునింపుఁడు అట్లుభారముచేసిండిన నీయోడ జయప్రదముగ మనలనింటిని జేర్చునని చెప్పెను. వారాతని గూఢాభిప్రాయ మెఱుఁగకున్నను నాతనిపైఁగల యాదరముచే నాతఁడు చెప్పినట్లొనరించిరి. తమచే సంగ్రహింపఁ బడినవన్నియుఁ బాషాణములును నిసుకయు ననియే వారు తలంచిరిగాని యవియెల్ల వైడూర్యములు మున్నగురత్నజాతులగునని వారెఱుఁగరు. సిరుల రాకపోక లెవ్వరికిని దెలియఁబడవనుట మన మెఱుంగనిది కాదు. ఆతూరి ప్రయాణములో శారికదియ లాభముగా నింటికి మరలిరి. అట్లొకరాత్రిగడుచు నప్పటికి కానుపారగుఁడా వర్తకులను మరుకచ్ఛదేశమునకుఁ దీసికొనివచ్చెను. అంతట నావర్తకులు వైడూర్యములు మున్నగు రత్నములచేఁ దమగృహములను, సమానమగు సంతోషముచేఁ దమమనోగృహములను నిండించుకొని యానుపారగునిఁ గులదైవముతోఁ బాటుగ మఱవక స్మరించుచు సుఖముగానుండిరి. తగినమిత్రుఁడు లభించినచో నందరాని లాభములెవ్వి? సుపారఁగుడును నింటికిఁబోయి సుఖముగ గాలమును గడపెను.

ఇట్లైనిమిదవదగు సుపారగజాతకము ముగిసెను.





## 9-వ కథ. బిసజాతకము

బోధిసత్త్వుఁడొకప్పుడు మిక్కిలిపావనమై కీర్తివంతమైన యొకబ్రాహ్మణవంశమందు జనించి సుగుణములకెల్ల నెల్లయనఁదగి శుక్లపక్షపుఁజంద్రునివలె నభివృద్ధినొందుచుండెను. ఆతనికి సద్గుణములచే నాతనిసోదరులనఁదగు నార్గురు తమ్ములును గడపారిదగు నొకచెల్లెలును గలరు. అతఁడు పుస్తకముముట్టినవేళ యెట్టిదోగాని తనవిద్యాభ్యాసకాలమును వ్యర్థపుచ్చక మిగుల శ్రమచెంది వేదములు వేదాంగములు మున్నగువానినెల్లఁ గొలఁదికాలముననే బాగుగనభ్యసించి గొప్పపండితుఁడను కీర్తినొందఁదగి యుండెను. కాలక్రమమున నట్లతఁడెల్లవారికిని సేవ్యుఁడై ఘనుఁడనిపించుకొనినను, దన తలిదండ్రులను దైవమువలె భావించుచు వారికివలయు నుపచారములను సుంతయేనిఁ గొఱంత గలుగనీయక వారిని సేవించుచువచ్చెను. మఱియు నతఁడు తనతమ్ములను దనయపత్యములవలెఁ బ్రేమతోఁ జూచికొనుచు, వారికగ్రజుఁడయ్యును వేదాదివిద్యలను నేర్పుటలోనుపాధ్యాయుఁడై వారిని విద్యావంతులుగను వినయవంతులుగను నొనర్చి భ్రాతృవత్సలుఁడనుటకుఁ దగియుండెను. ఇట్లుకొంతకాలము గడచెను. పిమ్మటఁ గొన్నినాళ్ళకుఁ బుత్రసంపదచే నానందించు నాతనితలిదండ్రులసూయాగ్రస్తుఁడై యంతలకోర్వని కాలుని ప్రేరణచేఁ బరలోకగతులైరి. అట్లుగతించిన తలిదండ్రులకు యథావిధిగఁ బ్రేతకృత్యములొనర్చి పితృఋణమునుండి విముక్తుఁడయ్యెను. ఆహా! తనతలిదండ్రులు గతించునప్పటికి మనబోధిసత్త్వుఁడును

మిక్కిలి యెక్కువవయసు గలవాఁడుగాఁడు. సోదరులును సోదరియు మఱియుఁ జిన్నవయసువారని వేఱచెప్పనక్కఱలేదు గదా! ఆతనికివచ్చిన యాపద యసాధారణమైయున్నది. అపు డతఁడేమిచేయును? అట్లుతన తలిదండ్రులు స్వర్గస్థులైన కొన్నిదినములవఱకు నెట్టెటోగడపెనుగాని యాతనికిఁజిన్ననాఁటి నుండియు నంకురించియున్న వైరాగ్యమాతని విడువకుండెను. అట్లువిరక్తుఁడగు నామహనీయుఁడొకనాఁడు తనసోదరుల నెల్లఁ బిలిచి ఓసోదరులారా! మనమిట్లెన్నిదినములు గలసిమెలసి యున్నను గొంతకాలమునకైనఁగలుగఁబోవు మనవియోగము చే దుఃఖము నియతమైయున్నది. కావున నేనిప్పుడేసన్యసింపఁదలఁచి యున్నాఁడను. మీరు మనయుత్తమబ్రాహ్మణవంశమునకుఁ దగునాచారములను బరిత్యజింపక పరస్పరభ్రాతృసౌహృదమును గౌరవమును గలిగి వర్తింపుఁడు. అతిథిసత్కారము మున్నగు సత్కార్యములను విడువక గృహస్థధర్మముల నెఱవేర్పుఁడు. అట్లైనచో మీకిహపరములు చేరువై సత్కీర్తివంతులగుదురని వారికి హితము నుపదేశించెను. అంతటి సోదరవాత్సల్యముగల యాతఁడొక్కమాఱుగా నట్లు వారిసంబంధమును విడుచుకొనుట సంభవించునా? యను శంక గలిగినఁ గలుగవచ్చును. కాని కర్మసూత్రమునతిక్రమించి వర్తించుట కెవ్వరికిని వలనుపడమిచే నాతనికట్టి వైరాగ్యము జనించినను జనింపవచ్చును. అట్లుతమ్ములగు తమ్మునువిడిచిపోయెదనని పలికెడు బోధిసత్త్వునిపలుకులు వారిచెవులకు ములుకుల వలె నాటఁగా వారు ఓయగ్రజా! నీకిట్లుపలుకుట తగుననియే



తోఁచెనా? తలిదండ్రులు మరణించిన నాఁటనుండియు నీవే మాకుఁ దల్లివనియుఁ దండ్రివనియు భావించు చున్నారము. అట్టియనాథులమగు మమ్ము నీగృహమున విడిచి నీవొక్కఁడవు నడవికేగెదవా? మేమును సంసారమునువీడి నీతోవచ్చెదమని పలికిరి. అపుడా సోదరుల మాటలనువిని ఓవత్సలారా! నిజముగు వైరాగ్యము లేక సన్యసించుట యధోగతికి హేతువగునని పెద్దలుచెప్పుదురు. కావుననే గృహవనవాసములందుఁగల విశేషముల నెఱింగియు మిమ్ముల నీగృహస్థాశ్రమ మవలంబింపుఁడని చెప్పితిని. మీకునునిది మనఃపూర్వకముగ నిష్టపడెనేని మనమందఱము సన్యసించిపోవుదము లెండని బోధిసత్త్వుఁడు పలికెను. అదివినివారు పరమానంద భరితులైరి. వారికాతని విడుచుటయే కష్టమనిపించెనుగాని యాతనివెంట నడవికిఁ బోవుటవలనఁ గలుగుకష్టములు కష్టములుగాఁ దోఁపవయ్యెను. పిమ్మట వారేడ్వురు సోదరులును నెనిమిదవదగు సోదరియును దమగృహమునఁగల ధనాదికమును దమ్మును విడుచుటకుసహింపని బంధువర్గమునువిడిచి తాపసవృత్తినవలంబింప బయలువెడలిరి. చిరకాలమునుండి వారిచేఁ బోషింపఁబడుచు వచ్చిన యొకసేవకుఁడును నొకదాసియుమాత్రము వారెంత రావలదని నివారించినను మరలక వారిని వెంబడించిరి. అట్లా పదుగురునుంగలిసి యొకయడవి కేగిరి. అది కలువలతోడను దామరలతోడను మిగులరమణీయమైన సరస్సులను గలిగియుండెను. వారును నివసించుటకుఁ దగిన పల్లవిపీడలనిచ్చు ఛాయావృక్షములును, దా[illegible] నిర్మల మధురోదకములును



గలిగిన యాయడవిలో నొకభాగమున వేర్వేఱుగఁ బర్ణశాలలు నేర్పఱచుకొని వానియందు నియమపరులై పరమేశ్వరుని నిరంతరముఁ ధ్యానించుచుఁ గాలముగడపుచుండిరి. మఱియు నాతని సోదరులును సోదరియు భృత్యులును నియమముగ నైదుదినముల కొకసారి ధర్మశ్రవణమునకై యాబోధిసత్త్వు నాశ్రమమునకుఁ బోవుచుండుట విధియై యుండెను. అతఁడును బలువిధములగు వృత్తులచే నధోగతికి హేతువై నిస్సారమగు నీసంసారమునెడ విరక్తి నిగలిగించు ప్రసంగములచే వారికి ధర్మముల నుపదేశించుచువచ్చెను. దాసియు సేవకుఁడును వెనుకటి చొప్పున వారిని మిక్కిలి భక్తితో సేవించుచుండిరి. మఱియు వారిలో దాసి ప్రతిదినము నాసరోవరమునఁగల తామరతూండ్లను దీసి మంచితామరాకులలో సమముగ వానిని విభాగించి పెట్టి యొకధ్వనివిశేషముచే నాహారకాలమును వారికెఱింగించి తొలఁగిపోవుచుండెడిది. వారాగుఱుతునుగ్రహించి తమతమజపహోమాదులు సమాప్తము లయినతోడనే వృద్ధానుక్రమముగ భాగములను దీసికొని వారియాశ్రమములకుఁ బోయి వానిని భుజించి యథాసుఖముగఁ గాలమును గడపుచుండిరి. కాని వారు ధర్మశ్రవణదినమునఁ దప్ప మఱియొకప్పుడొకరి నొకరు చూచుకొను నలవాటులేదు. ఇట్లు చిరకాలము గడచెను. ఇట్లుండఁగా నత్యద్భుతములగు వారితపోనియమాదులనువిని యింద్రుఁడొకప్పుడు వారినిఁ బరీక్షించుటకై యాపర్ణశాలల కడకువచ్చి మూర్తీభవించిన శాంతములనఁదగు వారిరూపములను గాంచెను. వారందఱు నపుడు సమాధిలో



నుండిరి. పరీక్షింపఁదలఁచి వచ్చిన యాయింద్రుఁ డంతతో మరలిపోవునా? లేదు. ఎప్పటిచొప్పున మిక్కిలి తెల్లనితామరతూండ్లనుదీసి, వానిని బరిశుభ్రముగఁ గడిగి మంచితామరాకులలోఁ బెట్టి దాసి తొలఁగిపోయెను. ఇంద్రుఁ డదిగాంచి వానిలో మొదటిభాగము నగపడకుండఁ జేసెను పిమ్మటఁ దమ యాహారకాలముల నెఱింగి యాసోదరులలో బోధిసత్త్వుఁడు మొదటిదగు తనభాగమును దొలుతఁ బరిగ్రహించుటకై యచటికిఁ బోయెను. కాని యాతామరాకున బిసఖండము లగపడకుండెను. అదిచూచి యెవ్వరో తనభాగ మపహరించి యుందురని తలఁచి శాంతస్వభావముతో మరలి తనపర్ణశాలలో యథాపూర్వకముగ ధ్యానపరుఁడై యతఁడుండెను. సజ్జనులు తమకుఁగలుగు సుఖాసుఖములకు వికారముఁ బొందక యుందురనుట వింతకాదుగదా! అట్లామహనీయుఁడూరకుండుటయేగాక యా సందర్భమును దనసోదరులకు సైతమెఱిఁగింపలేదు. ఆతని సోదరులా ప్రథమాంశ మచట లేకుండుటఁ జూచియు నెప్పటివలెఁ దమ జ్యేష్ఠభ్రాతయే గ్రహించి యుండుననితలంచి తమతమ యంశములను దీసికొనిపోయి భుజించి యెప్పటిచొప్పున ధ్యానపరులైయుండిరి. అట్లింద్రుఁడు వరుసగా నైదుదినములాతని యాహారము నపహరించుచు వచ్చెను. మిక్కిలి ధైర్యశాలియగు నాబోధిసత్త్వుఁడప్పటికిని జలింపని హృదయముతో దననియమముల నాచరించుకొను చుండెను. సహజధైర్యవంతుల కల్పములయెడ మనస్సంక్షోభ మనునది యొకప్పుడును గలుగదు సరేగదా! వారికిఁ బ్రాణహాని సంభవించినను భయ

పడదు. అట్లైమదినములు గడవఁగా నాతనిపర్ణశాల కొప్పటి
వలె ధర్మశ్రవణమునకై యాతని సోదరులు వచ్చిరి. కాని
వారికతఁడు కొంచెము కృశించి యున్నట్లగపడెను. అట్లు కృ
శించియు నతఁడు ధైర్యమును జిక్కఁబట్టియుండుట కెంతయుఁ
జింతియు నద్భుతముఁ గలుగ నట్లగుటకుఁ గారణమేమని వా
రాతని నడిగిరి. బోధిసత్త్వుఁడు వారితోఁ జరిగినదంతయు వ్య
క్తపఱచెను. అదివిని వారొకరినొకరు చూచికొనియు నేమి
యు ననుకొనలేక అయ్యో! ఎంతకష్టము సంభవించెనని లో
లోనఁ జింతించుచుండియు నిందుని పరిభావముచేఁ దనుదివ్య
జ్ఞానము మఱుఁగుపడ నాసందర్భ మెట్లుజరిగినదియు వారెఱుఁ
గఁజాలకుండిరి. పిమ్మట నాతనిసోదరులలో మొదటివాఁడు
తనయాత్మశుద్ధిని వెల్లడించుటకై ఓయగ్రజా! నీకాహారమగు
బిసములెవ్వఁ డపహరించెనో వాఁడు సకలసంపదలతోఁ దుల
తూగు గృహపతియై చక్కనిభార్యను బెక్కుఱు పుత్రపౌత్రు
లను బొందుఁగాకయని యొట్టుపెట్టుకొనెను. పిమ్మటఁ దక్కిన
వారుగూడ నిట్లే క్రమముగ నొక్కొక్క రొక్కొక్క శపథమును
గావించిరి. వారొనరించిన శపథములన్నియు మొదటివాని శప
థమువలెవిరక్తపురుషుల కత్యంతానిష్టమగుసాంసారిక సుఖరూప
ములగుపాపములనువారు పొందుదురనుభావమునే సూచించు
చుండెను. అట్లే సేవకుఁడును దానాబోధిసత్త్వునియాహారమునప
హరింపలేదని యొట్టుపెట్టుకొనెను. అనంతరమాతనిసోదరి ఓ
యగ్రజా! నీయట్టిమహనీయుని యాహారమపహరించిన యా
ఁడుది, సిరియుఁ జక్కఁదనము గలిగి రాజునకుఁ బ్రధానపత్ని



యగుఁగాకయని శపథ మొనర్చెను. తుదనుదాసి లేచి ఓతపస్వి
వర్యా! నీయాహారము నపహరించిన యాఁడుది సత్కారలబ్ధ
మగు మధురపదార్థము నెవ్వరికిఁబెట్టక తానొక్కతె యనుభ
వించుఁగాకయని యొట్టుపెట్టుకొనెను. అటులే యాతఁడు బో
ధించు ధర్మములను వినుటకై వచ్చిన యక్షుఁడు మున్నగువారు
ను వేఱువేఱుగ శపథములను జేసిరి. బోధిసత్త్వుఁడు వాని
నెల్లవిని తనశాంతమును హృదయగాంభీర్యమును దేటపడనిట్లు
పలికెను. ఓసోదరులారా! సోదరీమణీ! సేవకులారా! మీరె
ల్లరును నాయాహారము నష్టమగుటకుఁ గారణము గాకుండుట
నీశపథములమూలమున వెల్లడించిరి. కావుననేను నొకశపథ
మొనర్పవలసియున్నది. మీలో నెవ్వరియెడఁగాని నాయాహా
రము నపహరించునట్లు శంకనాకుండెనేని గృహస్థాశ్రమ మం
దుండి మరణించినవారి పాపమొందుదుఁ గాకయని పలికెను.
అనంతరమీ ప్రసంగమునకంతకుఁ బ్రధానహేతువగునింద్రుఁ
డు బహువైరాగ్య సూచకములగు వారిశపథములకు మిక్కిలి
యద్భుతమును గౌరవమును గలుగ మిగులఁ దేజోవంతులగు
నాతపోధనులకడ కేగి కపటకోపముతో ఓయీ! మీరెవ్వరు?
మీచరిత్రములు మిక్కిలివిచిత్రములైయున్నవే! లోకమున
మహామహులు సతతము పలుశ్రమములనొందుచు వేనికై
నిద్రాహారములుమాని తపస్సుల ధారవోయుచుందురో యట్టి
భోగములు మీచే నిందింపఁబడు చున్నవని యడిగెను. అదివిని
బోధిసత్త్వుఁడు ఓయీ! నీవెవ్వఁడవైనను నీప్రశ్నమునకు స
మాధానము చెప్పవలసియున్నది. భోగములధిక క్లేశకర్మములని

చెప్పుటకు సందియములేదు. వానికై నిరాహారములు పూని శాశ్వత సుఖప్రదమగు ముక్తినిచ్చు తపస్సులు దారపోయుదురను నీయాప్రసంగమే యిందులకుఁ బ్రబలనిదర్శనమై యున్నదిగదా! మునులు వీనిని బ్రశంసింపకుండుటకుఁ గారణమును జెప్పెదను వినుము. భోగములను గోరినచో భయక్లేశాదులను బొందవలసివచ్చును. మఱియు నెట్టిమిత్రుల మైత్రినయినను జెఱుపుటకును నీతిమార్గమును దొలఁగించుటకును బంధుతులను సైతము వరసుఖదూరులుఁగాఁ జేయుటకును నీభోగములే గదా ముఖ్యహేతువులు? కావుననే బుద్ధిమంతులగువారు కుపితములగుసర్పములకుఁబోలె నీభోగములనాశింపక దూరముగఁ దొలఁగియుందురని యతఁడు తనయభిప్రాయమును వెల్లడించెను. పిమ్మట నిందుఁడంతుల కమితానంద మొందుచుఁ దన యపరాధమును వారికివ్యక్తపఱచి యాతని బిసాహారమును దెచ్చి సమర్పించెను. అదివిని బోధిసత్త్వుఁ డాయింద్రుని తులువత్రుఁబనికిఁ గొంత కోపింపఁదగి యున్నను మిగుల గంభీరహృదయుఁడగుటచే నాతఁడర్పించిన బిసాహారమును నిరాకరించి ఓదేవరాజా! నీకేము బంధుగులమా? సహాయులమా? లేక నటులమా? మునులమగు మమ్మిట్లు పరిహాసములాడుట కేమి హేతువో యెఱుంగమని మృదువచనములచే నాతనిఁదిరస్కరించెను. అందులకింద్రుఁ డెంతయుఁ జింతయు భయమును గలుగ నమస్కరించి ఓమహానుభావా! అల్పబుద్ధిచే నేనొనర్చిన యీయపచారమును క్షమింపుము. నేనొనర్చినది తప్పు కాదని శుసవిచేయఁజాలను. కాని నన్నుఁబుత్త్రునిగాభావించి



మన్నింపవలయునని వేడుచున్నాఁడనని పలికి యంతర్ధానమయ్యెను. బోధిసత్త్వుఁడు సోదరులును దమతమతపోనియమములననుసరించుచు కాలమును గడుపుచుఁ దుదకుఁ బరమపదము నొందిరి.

ఇట్లు తొమ్మిదవదగు బిసజాతకము ముగిసెను.

## 10-వ కథ. చుడ్డబోధిజాతకము.

అంతశ్శత్రువులలో నొకటగుకోపమును జయించినవానెట్టిశత్రునైనను జయింపఁ గలుగునన్నుటకు సందియములేదు. లేనిచో మానవులు శత్రుసంఖ్యను హెచ్చించుకొందురని చెప్పవచ్చును. అందులకిదియొక దృష్టాంతమగును. బోధిసత్త్వుఁడుమిక్కిలిపావనమగు బ్రాహ్మణవంశమందు "చుడ్డబోధి"యను పేరితో సత్త్వగుణసంపన్నుఁడై యవతరించెను. అతని పూర్వులు మిగుల విద్యావంతులును గీర్తివంతులునై యుండిరి. అతఁడును 'సంస్కారాఃప్రాక్తనాఇవ' అను కాళిదాసుని సూక్తిచొప్పునఁ బూర్వజన్మసంస్కారముచే విద్యాభ్యాసము చేయించిన కొలఁదికాలముననే వలయు విద్యలనెల్ల గ్రహించి విద్వత్సభలలోఁ బేరునొందఁ దగినవాఁడయ్యెను. మణులకు రత్నశాస్త్రజ్ఞులును, శూరులకు యుద్ధములును, విద్వాంసులకు బండితసభలును లభించినపుడేగదా వారికీర్తులు పైకివచ్చుట. అట్లొక గృహస్థునకుఁ బుత్త్రుఁడైయుండియుఁ బూర్వజన్మమున యోగాభ్యాసము గలవాఁడగుటచేఁగావలయుఁ జిన్ననయసునందే వైరాగ్యముగలిగి సంసారమందు మిగులఁ బ్రీతిలేకయే

మెలఁగుచు వచ్చెను. పతివ్రతాతిలకమగు నాతని పత్నియు సహధర్మిణియై నీడవలెఁ జరించుచుండెను. ఇట్లుండఁగా నొకప్పు డా మహనీయుఁడు అహా! మానవులు మోహాదులకు లోనై పలుకష్టములకుఁ గారణమగు నీసంసార కూపమునఁ బడి చెడుచున్నారే. అయ్యో! నిస్సారములగు నీసుఖములకై యింతపరితపింపనేల? అని పెక్కురీతులఁ జింతించుచుఁ దన విభవములతోఁ బాటు గృహస్థవేషమును నైతము విడిచి, కాషాయవస్త్రములను ధరించి యిల్లువెడలెను. అట్లు విరక్తుఁడై చనుచున్న భర్తను గాంచి యాతని భార్య మిగులభక్తిగలదగుటచేఁ దానాతని వెంబడింపఁదలఁచి కొప్పుముడువక భూషణముల నెల్లవిడిచి, సహజసుందరమగు తనమేనికిఁ గాషాయవసనమలంకారముగ బయలువెడలెను. బోధిసత్త్వుఁ డాయత్నముఁ జూచి 'ఇట్టి నీసౌకుమార్యమెక్కడ? తపోవనమెక్కడ? కావున నీవు రాఁదగ' దని వారించెనుగాని యామె యందులకంగీకరింపదయ్యెను. మఱియు నతఁ డామెతోఁ ఓవనితారత్నమా! నాయెడ నీకుఁగల భక్తి వ్యక్తమైనది. అడవినున్న పరివ్రాజికలతోఁ గూడియుండఁగలవా? యని శంకించుచున్నాఁడను. అది మిగుల భయంకరములగు మృగములతో నిండియుండును. కావున నావచనము నిరాకరింపక నాయెడ భక్తి నిలిపి యింటనుండుమని బోధించెను. ఆమెయు నాతఁ డెన్ని చెప్పినను మనసుత్రిప్పికొనక కన్నులనుండి కడవలకొలఁది నీరు గార్చుచు ఓమహానుభావా! మీవెంట నంటివచ్చుటయే నాకు శ్రేయమని తోఁచినచో మీకప్రియమును నాకుఁగష్టమును



నగు నీవనికేల యత్నింతును? మీపాదసేవనము విడిచియుండుటయే నాకుఁగష్టము. కావున మీయాజ్ఞోల్లంఘనమునకై కోపింపక నాయీప్రార్థన నంగీకరింపుఁడని యాతని పాదములపైఁబడెను. ఇట్లొకటి రెండుసారులు తాను బోధించినను దన్నువిడుచుతలఁపు లేకుండుటను గనిపెట్టి మిగులదయాళుఁడగుటచే నామెమాటను గాదనలేక యతఁ డూరకుండెను. వారిరువురును జక్రవాకదంపతులవలె విడువక యొకమహారణ్యమును జేరికొని యందొక ప్రదేశమున నివసించిరి. ఆయ్యది గొప్ప ఛాయావృక్షములతోడను, నిర్మల జలపూర్ణములగు సరోవరములతోడనుగూడి నివాసయోగ్యమై యుండుటచే వారుసుఖముగఁ గాలమునుగడపఁగలిగిరి. అచటవారు వేర్వేఱుగ నాశ్రమములఁ గల్పించుకొని నియమపరులై కందమూలాద్యాహారము లుదరపోషణముగ నుండిరి. ఇట్లుండఁగా నొకప్పు డా దేశమునుబాలించు రాజకుమారుఁ డొకఁడది వసంత సమయమగుటచే నరణ్యవిశేషములఁ దిలకింపఁదలఁచి మన్మథునకు నివాసస్థలములనఁదగు నాయాచోటులఁ దిరుగుచుఁ బల్లవపుష్పభరితములగు వృక్షములను, దామరసములకు నెలవులగు సరోవరములను దిలకించుచు మునిదంపతులున్న యాశ్రమభూరుహములకడకు వచ్చెను. అచటనా రాజపుత్రునకుఁ దేజశ్శాలియగు నొకమునియు నొకపరివ్రాజికయు నగపడిరి. వారుమన మునిదంపతులేగాని వేఱుగాదు. శాంతమూర్తులగువారిని సవినయముగ సందర్శించి, వారియాదరమున కెంతయు నా రాజపుత్రుఁడు సంతసించెను. ఇట్లు కొంతసేపచట

నుండువఱకు సహజ సౌందర్యవతియగు నాబోధిసత్త్వుని ధర్మపత్ని యువకుఁడగు నారాజపుత్త్రునకు మనోవికారమును గలిగించెను. ఆహా! ఇంద్రియముల స్వాతంత్ర్య మెట్టిదో చూడుఁడు. దేశకాలపాత్రవిమర్శన మక్కఱలేదు. ఆరాజకుమారుఁడు తొలుతమిగుల భక్తితో వారినిసేవింపవచ్చెను. ఆమెయు మూర్తీభవించిన పాతివ్రత్యమనుటకు సందియములేదు. మఱియునామె మహామునికి ధర్మపత్నియనియు నాతఁడెఱుంగును. ఇట్టిస్థితిలో నారాకుమారునకుఁ గామవికారము గలిగించిన దింద్రియప్రాభవమేగదా! అతఁడు తొలుత నాపతివ్రతాతిలకము నపహరింపఁ దలఁచెనుగాని యమ్మహాముని క్రోధాగ్నిజ్వాలలు తన్ను దహించునేమోయను భయముచే ధైర్యముచెడి యట్లొనర్పఁజాల కూరకుండెను గాని యింద్రియవికారమాతని నూరకుండనిచ్చునా? పిమ్మట నతఁడామె తనకుఁజిక్కుట కిట్లొక యుపాయమాలోచించెను. "ఇమ్మునితపఃప్రభావము నెఱుంగక నేనేమియుఁ జేయుటతగదు. ఇతఁడీమెయెడ నింకను ననురాగము గలిగియుండెనే నీతనికిఁ దపస్సిద్ధి గలుగలేదని యూహింప వచ్చును. అపుడీమె నపహరింప వచ్చును."

ఆరాజపుత్త్రుఁ డట్లాతని తపఃప్రభావ మెఱుంగఁగొనఁదలఁచిన వాఁడగుటచే బోధిసత్త్వుని సమీపించి యతని హితము గోరువానివలె ఓపరివ్రాజకోత్తమా! ఇదికృతియుగమనుకొంటివా? ఇక్కాలము తఱచుగ ధూర్తులతోడను సాహసికులతోడను నిండియుండుట నెఱుంగవా? ఇట్టిదుష్కాలమున నసహాయముగ నిట్టియరణ్యమున నీయువతితో నుండుట మేలగునా? ఈమెయెడ నెవ్వఁడేనపచార మొనర్చినచో నీవేమి చేయఁగలవు? అపుడెల్లరకును విచారింపవలసివచ్చునే? మఱియు యతులగువారిట్లు యువతీసాన్నిధ్యము నంగీకరింపవచ్చునా? యని యడిగెను. అదివిని బోధిసత్త్వుఁడు ఓరాజా! నీవన్నది నిజమే. అయినను నెయ్యదినాయెడఁ బ్రతికూలభావముగలిగి వర్తించునో దానిని నేనెట్లునిలుపఁగలనని బదులుచెప్పెను. అనంతరమా రాజపుత్త్రుఁడు ఈమునికీమెయందింకను ననురాగమున్నట్లే కాన్పించెనని. కావున నీతని కపచారమొనర్చినను నాకుహాని సంభవింపనేరదని తలంచి యామెను దనయంతఃపురమును జేర్పుమని యొకపురుషున కాజ్ఞాపించెను. ఆమాటలు తనచెవిఁబడినతోడనే యాపతివ్రతాతిలకము క్రూరమృగములచేఁ దఱుమఁబడు నాఁడులేఁడివలె భయభ్రాంతయై అయ్యో! లోకములో దుర్జనులు సాధులకు బాధలొనర్చునపుడు వారిని రాజులుశిక్షించి సాధురక్షణ మొనర్చుట గలదు. అట్టిశాసకులగు రాజులే యిట్టిదురాచారముల నొనర్చిన వారించువా రెవ్వరు? పరమశాంతుఁడగు నాభర్త యిందుల కేమిచేయును? యింకనా కేమిదిక్కు? ఆహా! దిక్పాలకులారా! మీమీయధికారములు చెడెనా? ఓధర్మదేవతా! నీయునికి నామమాత్రమేనా? నాదురదృష్టవశమున నాభగవంతునికిని దయరాకున్నదేయని పలువిధముల మొఱపెట్టుచున్నను నారాజపురుషులామెను రథమ్ముపైఁబెట్టి రాజాంతఃపురమునకుఁ గొంపోవుచుండిరి. మహనీయుఁడగు బోధిసత్త్వుఁడు

యెల్లఁ గనిపెట్టియు వివేకబలముచే మనోవికారములేక శాంతచిత్తుఁడై యెప్పటివలెఁ జరించుచుండెను. అనంతరమా రాజకుమారుఁడా తపోధను నిశ్చలత కచ్చెరువొంది ఓ తపస్వీ! నీ ధర్మపత్నిని గొనిపోవుచుండుటను గన్నులారఁజూచియు నిట్లూరకుంటివి. అపుడామె నిన్ను వెంబడించినపు డంగీకరించియు నిపుడిటుల నూరకుండుటచే నీప్రతిజ్ఞకు యోగ్యతకు భంగము కాదా? చెప్పుమని యడిగెను. అదివిని బోధిసత్త్వుఁడు ఓ రాజా! నేను దొలుత నుండియు నెద్దాని నివారించుచుంటినో నేటికి దానిని విడుచుకొనఁగలిగితిని. కావున నేవ్యర్థప్రతిజ్ఞుఁడను గానని జవాబు చెప్పెను. పిమ్మట నా రాజసూనుఁడా తపస్విధైర్యమును శాంతమును గాంచి నిజముగుతపోధనునిఁగా నిశ్చయించి అయ్యో! ఈ బ్రాహ్మణోత్తముని యభిప్రాయమును బాగుగఁ దెలిసికొనలేక పొరఁబడి యిట్లుచపల కృత్యమును జేసితిని. ఈతఁడు తొలుత విడువఁజాలలేననునది కోపముగాని భార్య గాదు. ఇపుడు విడువఁగలిగితి ననునదియుఁ గోపమే. దానికి మహనీయుని శాంతమే దృష్టాంతమని సత్యము నెఱింగి పశ్చాత్తప్తుఁడై తనయపరాధమును క్షమింపుమని యామునివర్యుని పాదములపైఁబడి యారాజకుమారుఁడా పరివ్రాజికను దెచ్చి యప్పటియట్లు సమర్పించెను. కావునఁ గ్రోధమను పరమశత్రుని జయించినవారికెల్లరును దాసులగుదురు.

ఇట్లు పదవదగు చుడ్డబోధిజాతకము ముగిసెను.



## 11-వ కథ. హంసజాతకము

సత్పురుషులు తమకాపదలు సంభవించుచున్నను న్యాయపథమును విడువఁదలంపరు. దుష్టులగువారట్టివారి ననుసరింపఁజాలక పరిత్యజింతురు. ఒకప్పుడు బోధిసత్త్వుఁడు సరస్సులలో మిగులఁ బ్రసిద్ధి వడసిన మానససరోవరమున ధృతరాష్ట్రుఁడను పేరితో హంసలకురాజై యవతరించెను. ఆ కారణముచేఁ గావలయు నాఁటినుండి యొకజాతి హంసములకు ధార్తరాష్ట్రములను పేరుకలిగెను. ఆ రాజహంసము నెల్లపుడు విడువక లెక్కకుమీఱిన హంసములేకాక మఱికొన్ని జలపక్షులు సైతము సేవించుచువచ్చెను. మఱియు నయాన యపరిజ్ఞాతయు, దూరదర్శియు, గొప్పవంశమునజనించినదియు, స్వామిభక్తిగలదియు, సత్స్వభావము క్లేశహత్వము మున్నగు గుణములకు నెలవైనదియునగు సుముఖుఁడను నొకహంసమాతనికి సేనాపతిగా నుండెను. వారికిఁగల పరస్పరప్రేమ వర్ణనాతీతమనుటకు సందియములేదు. వారిహృదయములును మాటలును పనులును నీరక్షీరములఁబోలె నేకమై యొరులకుఁ దేరిచూడరాక వారుమెలఁగుచుండిరి. అప్పటికాలమున మహనీయుఁడగు నార్యానందనుఁడను బౌద్ధముని గురుపదము నలంకరించి యుండెను. ఆ రాజసేనానాయకు లిరువురు నార్యానందసునకుఁ బ్రధాన శిష్యులై తక్కినహంసలను గొన్నిటిఁ దమకు శిష్యగణముగను బితృజ్యేష్ఠులవలె మఱికొన్నిటిని బుత్రులుగను భావించి వానివాని హితమునుగనిపెట్టుచుఁ దమపాలనావిధము నరయు

మానవులకేగాక దేవతలకుసైతము నాశ్చర్యమును గలిగించుచుండిరి. మింటఁజరించు పక్షులకు ఱెక్కలవలె వారాపక్షులకెల్ల రక్షకులై యుండుటచే, ధర్మార్థములచే లోకమువలె నాపక్షిగణము మిగులనభివృద్ధి నొందుచుండెను. అట్లు వానితోఁగూడియున్న యాసరస్సు చరించు పద్మములతోఁ గూడినట్లును, నచ్చటచట మూఁకలుగాఁ జేరియున్న హంసలచే నొక్కచోఁ బ్రోగుపడిన మేఘఖండములుగల యాకసమున్నట్లును జూచువారికిమిగుల రమణీయమై యుండెను. అందున్న యా రాజసేనాపతుల సుగుణములను వినినవారెల్లరును వానిసచ్చరిత్రములను గాథలుగాఁ జెప్పుకొనుటయేగాక హంసలై జనించిన కేవలనయవినయములనియే వారిని బొగడుచు వచ్చిరి. అట్లగుటచే వారికీర్తి లోకమునందెల్ల వెన్నెలవలె వ్యాపింపఁ జొచ్చెను. ఇట్లుండఁగా నొకప్పుడు కాశీపురాధిపతియగు బ్రహ్మదత్తుఁడను నొకరాజోత్తముఁడు కొలువుదీర్చి యుండఁగా నచటనున రాజసేనాపతుల సుగుణసంపదల నాశ్చర్యముగఁ గొందఱుపన్యసించిరి. అదివిని యాబ్రహ్మదత్తుఁడా హంసల నెట్లయినఁ జూడవలెనను తలఁపుగలిగి తనమంత్రులతో ఓ మంత్రులారా! ఇపుడిట్టి సభాస్థానమునఁ బొగడొందిన యా రాజహంసములను గాంచఁగల యుపాయమేదే నాలోచింపుఁడని పలికెను. పిమ్మటవారు కొండొకసేపాలోచించి ఓరాజోత్తమా! ప్రాణులన్నిటికి సుఖములెడ నాశ బరవత్తరమైనదని చెప్పుటకు సందియములేదు. నివాససౌభాగ్యములగు తావులు దొరకినపుడా చోటులనువిడిచి యవిపరదేశముల కేన్నఁ



డును బోనొల్లవు. కావున నారాజహంసములు నివసించు సరస్సునకన్నివిధములచే మించునట్లుగ నొకసరస్సు మనమీయరణ్యమునఁ ద్రవ్వించి ప్రచురింపవలయును. అట్లొనర్చినచో నారాజహంసములు "అతిపరిచయాదవజ్ఞా" అనుసూక్తి చొప్పున మానసమువిడిచి సుఖాభిలాషచే నిచటికిఁ దప్పక వచ్చును. మనమపుడు వానిని జూచుటయేగాక సంగ్రహించనువచ్చునని యొకయుపాయమును జెప్పిరి. ఆయమాత్యుల యుక్తిచమత్కృతికా రాజన్యుఁడు మెచ్చుకొని, మంత్రివరులారా! అటులయిన మనపురమునకుఁ జేరువగానున్న యడవిలో మానససరస్సు నించుమించుగామించు నొకగొప్ప సరోవరము వెలయింపుఁడు. అది నిర్మలోదకమును, పద్మములు మున్నగు పుష్పజాతులును, గలిగియుండవలెను. దానినలువైపుల రమణీయములగు పుష్పప్రధాన వృక్షముల నాఁటవలయును. వేయేల, అదిదృష్టిపథమునఁబడునంతనె నక్షత్రముల కద్దమనఁదగి కనుపండువు సేయవలయునని యాజ్ఞాపించెను. పిమ్మట రాజాజ్ఞానుసారముగ నాయమాత్యులట్టి సరోవరమును గొలఁదికాలముననే వెలయించిరి. క్రమముగాఁ బక్షులొక్కొక్కటి దానిని జేరుచుండెను. అంతలో శరదృతువు ప్రాదుర్భవించెను. మేఘముల నెడ తెరలువోయి దిక్కులు విశదముగా నగపడఁజొచ్చెను. సరస్సులన్నియు నిండుగువ్వెటినట్లు నిర్మలములై యుండెను. వెన్నెలలు పిండారఁబోసినట్లు మిగులమనోహరములై కాన్పింపఁజొచ్చెను. పలువిధములగు పచ్చనిసస్యములు పుడమిచెలికు కలంకారములనఁదగి యుండెను. అట్టి

సమయమున స్వచ్ఛములగు దిగంతములందుఁ దిరుగుచు నా మానససరోవరము నుండియే పోవుచున్న రెండుహంసలు బ్రహ్మదత్తుని కొలనిఁ గాంచి దానిని సమీపించెను. వాని మానసమునకది మానసముకంటె నెక్కుడు సంతసమును గలిగించునదయ్యెఁ. అవి తక్కిన హంసయూథమును సయితము తామనుభవించు సుఖమునకుఁ బాల్పఱుపవలయునని చింతింపఁజొచ్చెను. లోకములోఁ దఱచుగఁ దమకుఁ దగుసుఖము గలుగునప్పుడు తమమిత్రులు స్మరణకువచ్చుట వింతగాదుగదా! అట్లా హంసములు కొన్నిదినములా సరోవరమున విహరించుచువచ్చెను. కాలక్రమమున వానిసుఖము చూపోపనివిపోలె నాకసమందెల్ల నల్లనిమేఘములు గుంపులుగూడి వర్షములఁ గురియ నారంభించెను. అంతట నాహంసమిథున మచట నివసింపఁదగదని యెప్పటియట్ల మానసమునే చేరుకొని యొకనాఁడా రాజహంసములతో దేశవృత్తాంతములను జెప్పుచుఁ దామున్న క్రొత్తకొలని వృత్తాంతము సత్యద్భుతముగా వర్ణించి దేవా! ఈవచ్చువర్షఋతువు గడచినతోడనే యాసరోవరమునకుఁ దా మొకసారి దయచేసి చూచితీరవలయునని మాయభిప్రాయమని చెప్పెను. ఆయంచలప్రసంగము వినినతోడనే సేనాపతియగు సుముఖున కొకనికిఁదప్పఁ దక్కినవానికెల్ల నాక్రొత్తకొలనిఁ జూడవలెనను కోర్కి గలుగుటను వానిముఖవిలాసములు కొంత వ్యక్తపఱచుచుండెను. పిమ్మట నాహంసరాజు సేనాపతియగు సుముఖునిఁజూచి ఓయీ! ఇందులకు నీవేమనెదవని యడిగెను. అదివిని బుద్ధిశాలియగు నాసుముఖుఁడు నమస్క-



రించి ఓహంసాధినాథా! మన మచటికేగుట యనుచితమని తలంచెదను. దంతకేశాదులవలె నల్పులగువారు స్థానభ్రంశముచే శోభింపరని పెద్దలు చెప్పుదురు. మఱియు మనకిందులేని దెద్ది? అందుఁగల విశేషమేమి? మనోహరములగు నిట్టియామిషములఁ జూపెట్టి కొందఱు వంచకులగు మానవులు మనయట్టి యమాయకులను మోసపుచ్చుచుండుట వినుచున్నారముగదా! "ప్రయోజనమనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే" యనున్యాయముచొప్పున నేదేనొకలాభము నపేక్షింపక యారాజేంద్రుఁడంతటి వ్యయమొనర్చి యాసరోవరము వెలయించియుండునా? కావున నందొక మోసమెద్దియో కలదనియే నాకుఁదట్టుచున్నది. అయినను దమకాసరోవరమవశ్యము దర్శనీయమనియె తోఁచినచోఁ బరివారముతోఁగూడ నచటికిఁ బోవచ్చును. అందుల విశేషములఁ జూచిరావచ్చును. కాని యచటనివసించుట మాత్రము తగదని నాయభిప్రాయము. అటుపై దేవరచిత్తమని యుపన్యసించి యూరకుండెను. ఆహితోపదేశము మిక్కిలిరుచింపకున్నను నప్పటికతఁడూరకుండెను. పిమ్మటనొకనాఁటి వెన్నెలరాత్రి నాహంసయూథమంతయు నాక్రొత్తకొలనిదర్శింపఁ దమకుఁగల యభిలాషాతిశయమును వెల్లడించుటచే సుముఖునిమాటలు స్మరింపక యారాజహంస యాకృత్రిమసరోవరమునకు సేనాపతితోఁ గూడఁ బ్రయాణమయ్యెను. ఆహా! హంసరూపధారియగు నాబోధిసత్త్వుఁడు వివేకశూన్యుఁడని చెప్పఁగలమా? 'బుద్ధిః కర్మానుసారిణీ' యని పెద్దలు చెప్పినట్లింతటి ధీమంతుఁడును తనభవితవ్యతను దప్పిం-

చుకొనఁజాలఁడుగదా ? ఇట్లా హంసరాజు తనపరివారముతో బయలువెడలి యామానసరోవరము నందము నవలోకించుచుఁ బరమానందభరితుఁడయ్యెను. మఱియు నందలి విశేషములనుఁ గాంచిన యాతనిపరివారముల మానసములకు మానసమను మాట రుచింపకుండెను. పిమ్మట నామానసరోవరమునకుఁ గావలిగా నున్న పురుషులు కొందఱా హంసలరాక నాబ్రహ్మదత్తున కెఱింగింపఁబోయి ఓరాజోత్తమా ! మానససరోవర వాసులగు హంసతెట్టువని దేవరవింటిరో యట్టి రెండుహంసలు ముద్దులొలుకు నాకారములచేఁ దమసరోవరము నలంకరించి యున్నవి. నేఁటికి దేవరప్రయత్నమెంతయు సఫలమయ్యెనని మనవిచేయ వచ్చితిమని సవినయముగా విన్నవించుకొనిరి. అదివిని బ్రహ్మదత్తుఁడమందానందమున నుప్పొంగుచు నెఱుకలను గొందఱ రప్పించి యాహంసముల నెట్లయిన సజీవముగఁ బట్టితెండని యాజ్ఞాపించెను. వారిలో నొకనేఱుకగల యెఱుక నమస్కరించి దేవా ! ఏలినవారిపాదసేవకుఁ డీకార్యము సులభముగా నిర్వహించిరాఁగలఁడు. సెలవిప్పింపుఁడని బిఱబిఱంజని తన చాతుర్యమునకుఁ దగినతఱి యొదవెనని సంతసించుచుఁబోయి మెల్లగనాచేరువ నుఱులుపన్ని యొకప్రక్క నొదిగి యుండెను. అంతట మిగులనుత్సాహముతో నోడలెఱుంగక యెడనెడఁ దిరుగాడు నాహంసయూథములో దైవవశమున నారాజహంసయే చెఱువున నాయెఱుకపన్నిన యుఱిలోఁ జిక్కుకొనియెను. హాని శంకలేక యొరులనమ్మి చరించుట యొకప్పుడు ప్రమాదమును గలిగించును. ఆపదలకుఁ బక్షపాత ముండునా ? అవి



మంచిచెడ్డలను విమర్శించునా ? దానికిబీదసాదలతోఁ బనిలేదు. అధికారులనెడ భయములేదు. మంచివారనిదయలేదు. అట్లుఱిలోఁ బడియు నతఁడు మహాధైర్యముతో నుండెను. మహాపురుషులొకప్పుడు పొరపడిగాని లోకోపకారమునకై బుద్ధిపూర్వకముగఁగాని యొరులచే బద్ధులయ్యును దమధైర్యమును గోల్పోవకయుండుట వింతకాదుగదా ! అనంతరమా రాజహంసము తనకు సంభవించిన యాపద తనపరివారమునకుఁ గూడఁ గలుగకుండఁ దొలఁగిపొమ్మని సంజ్ఞయొనరించెను. దానినా హంసములన్నియు గ్రహించి యాతనికిఁగలిగిన విపత్తునకు వగచుచు నందుఁబిరికులగు తమ్ము నిందించుకొనుచుఁ దమప్రాణములను గాపాడుకొనుటకై హతనాయకమగు సేనవలెఁ జెదరి నలువైపులకుఁ బాఱిపోయెను. స్వామిభక్తుఁడగు సుముఖుఁడు మాత్రము మారాజహంసమును విడువక సమీపవర్తియై విచారించుచుండెను.

అమాయికులగు మిత్రులు తమహితులకు సంభవించిన యాపదకెంతయును జింతింతురు గాని తన్మూలముగఁ దమకుఁ బ్రాణహాని యగునని శంకింపరు. అట్లు తనపార్శ్వమున నిలిచియున్న సుముఖునిఁ జూచి యారాజహంసము ఓసేనాధిపా! తొలఁగిపొమ్ము పొమ్ము. మఱియింక జాలము చేయుటతగదు. ఇట్టినాకీవేమి సహాయము చేయఁగలవు ? అని, పెక్కువిధముల బోధించెనుగాని యాసుముఖుని దృఢచిత్తమందుల కంగీకరింపదయ్యెను. అట్లా యిరువురునుగలిసి తమకుసంభవించిన ప్రమాదమునకు మిగుల వగచుచుండఁగా నంతలో నాయెఱుక మెల్ల

గానచటికి వచ్చుచుండెను. ఆహంసములాతనిం గాంచి తమప్ర
సంగమును ముగించి యూరకుండెను. ఆయెఱుకయు నాయు
ఱులకడకుఁబోయి యాహంసలను జూచెను. కానియవితన్నుఁ
జూచి కదలకుండెను. అంతట నాకిట్టవేటకాఁడట్లవి కదలకుం
డుటఁగాంచి యవి యుఱిలోఁబడినట్లే యూహించి వానితో
సంబంధించిన త్రాళ్లుబిగియునట్లులాగి వానికడకుఁబోయి చూ
డఁగా నందొకటియె చిక్కుటయును, రెండవది యాచిక్కిన
దానిని సేవించుచుండుటయు నాతఁడు కనుఁగొని మిక్కిలివిస్మ
యముతో ఓహంసమా! నీవు నావలలోఁజిక్కకుండియు నిక్లే
ల వ్యర్థముగాఁ బ్రాణహానిఁ గోరికొనియెదవని యడిగెను.
సుముఖుఁడా వేటకాని వచనములనువిని మనుష్యభాషతో
ఓయీ! నాయూయుంచతేఁడు నీయుఱిలోఁ జిక్కియుంటచే నేఁ
బోవ సమర్థుఁడనైయుండియును బోవకుంటిని. ఈమహానీయుఁ
డు నీదృఢపాశములకుఁ జిక్కియుండెనుగాని యంతకంటె దృఢ
తమములగు నీహంసరాజు సుగుణములచేత నేబద్ధుఁడనైయుం
టినని మృదుమధురముగాఁ బలుకఁజొచ్చెను. ఆయెఱుకయు
నాతనిస్వామిభక్తికేగాక యాతనివాక్చాతుర్యమునకు నయిత
మాశ్చర్యపడసాగెను. అంతట సుముఖుఁడా యెఱుకని విస్మ
యమునుబట్టి యతఁడు తనకుఁ బ్రసన్నుఁడగుటెఱింగి ఓయీ!
ఈతని నెట్లయిన విడిచి చిరకీర్తియుఁ బరమపుణ్యము నొం
దుము. మఱియు నీవునన్ను సంతసింపఁ జేయఁదలఁచుటయు
దుఃఖపఱుత దలంపకుండుటయు నిర్వివాదాంశమేగదా! నాబ
హిఃప్రాణమగు నీరాజహంసమును విడువక గొంపోయినచో



నీతలంపెట్లు నెఱవేరును? ఇంతియకాదు. చూచితివా? ఈ
హంసాధినాథునకై యాహంసలెల్ల నెట్లెదురుచూచుచున్న
వో. కావున మమ్మీయాపదనుండి యుద్ధరించినచో నిన్ని ప్రా
ణుల నుద్ధరించినవాఁడవగుదువు కొంచెము దూరమాలోచిం
పుమని పలువిధముల వేడికొనెను. ఆసుముఖుని వాగ్ధోరణికి
సహజక్రూరమగు నాకఱకుటెఱుకచిత్తము నయితము కరఁగి
ఓహంసమా! నీస్వామిభక్తియు నీజీవితనిరపేక్షయు నాకెంత
యు సంతసము గలిగించెను. మానవులందేగాదు దేవతలందు
నయితమిట్టి యద్భుతచరిత్రములను నేఁగనియుండలేదని పలికి
యాబ్రహ్మదత్తుని యానతినాదరింపక యారాజహంసములను
బోవిడిచెను. పిమ్మట సుముఖుఁడును గృతజ్ఞతా సూచకము
లగు వచనములు పలికి ఓయెఱుకతేఁడా! నీపడిన శ్రమము
విఫలముకాఁగూడదు. కావున మమ్మిరువురను గావడింబెట్టి
మారాజునకుఁ జూపుము. మేమెట్లయిన రాజునుమెప్పించి
తప్పించుకొని పోఁగలము. అట్లయినచో నీచాతుర్యమునకు
మెచ్చికొని నిన్నుఁదప్పక యాతఁడు బహుమానించునని చెప్పెను.
ఆసుముఖుని నిర్బంధముచే నాయెఱుకయట్లెయని యాహంసము
లఁబట్టి కావడిం బెట్టి రాజసన్నిధికిఁ గొంపోయి చూపించెను.
ఆరాజా రాజహంసలనుగాంచి ఓనిషాదాధినాథా! ఇట్లివి స్వే
చ్ఛగఁ జరించుచు నీకెట్లుహస్తగతములయ్యెను? వినిపింపుమని
ప్రశ్నించెను. అదివిని యానిషాదుఁడు జరిగిన వృత్తాంతమం
తయు నున్నదున్నట్లుగా విన్నవించుకొనెను. పిమ్మట నాహం
సములతో నారాజోత్తముఁడు కొంతవడి వినోదించి సగౌరవ

ముగ వానిని విడుచుటయేగాక యాకిరాతునకు బహువిధములగు నమూల్యాభరణములు మున్నగువాని నొసంగి సెలవిచ్చి పంపెను. ఆరాజహంసయును దనసేనాపతి మున్నగు పరివారముతోఁగూడి తననివాసమగు మానస సరోవరమును జేరికొని యథాసుఖముగఁ గాలమును గడుపుచుండెను. నాఁటినుండియు నేఁటేఁట నాబ్రహ్మదత్తుఁడును నారాజహంసమును దర్శించి యానందించుచువచ్చెను.

ఇట్లు పదునొకండవదగు హంసజాతకము ముగిసెను.

## 12-వ కథ. మహాబోధిజాతకము.

సజ్జనులొకప్పుడొరులచే నవమానింపఁబడియు నవమంతల యల్పోపకారమునెడఁ గృతజ్ఞతగలిగి వారిమైత్రిని విడువరుగదా! బోధిసత్త్వుఁ డొకప్పుడొక సంపన్నగృహస్థునింట జనించి కాలక్రమమునఁ బరివ్రాజకుఁడయ్యెను. అతఁడు జ్ఞానోదయమగునప్పటి నుండియుఁ బరివ్రాజకుఁడు కాఁదలంచియు లోకోపకారమునకై వలయు పలువిధములగు కళలను సమస్త విద్యలను గృహస్థుఁడై సంపాదింప యందార్యపదము నలంకరింపవలసివచ్చెను. అతఁడారీతిగ లోకానుభవము గలిగి పరివ్రాజకుఁడై దేశముల సంచరించుచు నందందుఁగల పండితులను; బండితప్రియులగు భూపతులను, వారికిని గౌరవనీయులగు తనయట్టిపరివ్రాజకులను గాంచుచు వారివారిసత్కారములకుఁ బాత్రుఁడగుచువచ్చెను. 'పుణ్యైర్యశోలభ్యతే' అను సూక్తి చొప్పున నప్పటిపరివ్రాజకులెవ్వరును నీతనికీర్తినిఁబోలు



కీర్తికిఁ బాత్రులుగాఁ జాలకుండిరి. అట్లుమిగులఁ బ్రసిద్ధివడసి యామహనీయుఁడు లోకోపకారమునకై పాటుపడుచు గ్రామనగరపల్లీజనపదములందుఁ దిరిగి తిరిగి యొకప్పుడొకరాజోత్తముఁడు పాలించు దేశమునకుఁబోయెను. ఆభూపాలుఁడు గుణజ్ఞుఁడును బండితుఁడునగుటచే మనపరివ్రాజకోత్తముని రాకవిని దూరమునుండియే యెదుర్కొని సగౌరవముగఁ దోడ్తెచ్చి తనయుద్యానమున నాతనికివిడిదియొసంగి యాచార్యునిఁగా భావించి గౌరవించుచువచ్చెను. గుణప్రియుఁడగు నారాజన్యుఁడు మహైశ్వర్యసంపన్నుఁడు. గుణసముద్రుఁడగు పరివ్రాజకుఁడాతని యింటికతిథియయ్యెను. అప్పటి యుత్సవసందర్భమెట్లులుండునో వేఱచెప్పవలెనా? పిమ్మట బోధిసత్త్వుఁడు ధర్మబోధకములును, శ్రేయోదాయకములునగు కథలను వినువారలు సంతసించునట్లారాజన్యునకుఁ జెప్పుచుండెను. లోకమున మహనీయులగువారు భూతదయావిష్టులై యెల్లవారికిని శ్రేయమునుగలిగించు మార్గములబోధించుటయే యొకపనిగాఁ జూచుచుండఁగా సత్పథములఁ దెలియఁగోరు నారాజోత్తమునకాతఁ డుపదేశించుట క్రొత్తగాదుగదా! ఇట్లాబోధిసత్త్వుఁడాభూనాథునిచేఁ బలువిధములగు సత్కారముల నందుచుఁ గొంతకాలము గడపుచువచ్చెను. కాని యందుల్కచటిపండితులును నమాత్యులును నాతనిపై మిక్కిలియసూయపడుచుండిరి. నాఁటినుండి నేఁటివఱకును సమకాలికులగు ప్రతిభావంతులకుఁ బరస్పరమసూయలు జనించుటొక సంప్రదాయమై నట్లగపడుచున్నది. అయినను, రాజానుగ్రహమునకు మిక్కిలిపాత్రుఁడును,

సకలశాస్త్రజ్ఞుఁడునగు నాతని నప్పటిలో వారెట్లు పరిభవింపఁగలరు? కాని యంతటిమండియు నారాజపరివ్రాజకులకు వైరమునుత్పాదించుటకై పెక్కుత్రోవలరయుచుఁ గలహబీజములను నాటుచుండిరి. నానాఁటికి వారునాటిన కలహబీజములంకురించుటను గనిపెట్టి బోధిసత్త్వుఁడు లేనిసమయమున నారాజుకడఁజేరి ఓదేవా! ఈబోధిపరివ్రాజకునియెడ మీరింతటి విశ్వాసముంచుట యనుచితమని మనవిచేసికొనుచున్నారము. దేవరగుణజ్ఞతకును, ధార్మికత్వమునకు నసూయగలిగి మిమ్ము వంచించుటకై శత్రురాజొకఁడు కపటములగు మధురోక్తులచేనొరుల వంచింపఁదగిన యిట్టిచారునిఁ బంపియుండునని యూహించెదము. కానిచో నర్థకామములకును, రాజకార్యములకును దూరములగు నీరిక్తధర్మముల నీతఁడిట్లుపన్యసింపనేటికి? మఱియు దూతలకుఁ బరిచితములగుముఖస్తుతులేగాని రాజనీతిమార్గము లెట్టివో యెఱుంగనట్లీతని వాగ్ధోరణినిబట్టి యూహింపఁదగియున్నది. కావున నీతనియెడ నీసేవకులమగు మాకెల్లరకును శంకపొడముచున్నదని పలికిరి.

కలహజనకములగు వారివచనములు పలుమాఱులట్లు వినుటచే నదిహితమైనట్లగపడి క్రమక్రమముగా నాపరివ్రాజకునియెడ నారాజన్యునకు మనమునఁ గొంతమార్పుగలిగెను. అట్లాపరివ్రాజకునెడ నమ్మికచెడిన నాఁటినుండియు నాతనికి జరుగవలసిన సత్కారాదులకును లోపముగలుగుచు వచ్చెను. గానిబోధిసత్త్వుఁడు మాత్రమందులకుశంకింపక బహుకార్య



ధురంధరత్వముచే రాజునకవకాశము చాలకుండెనని సమాధానముచేసికొనెను. శుద్ధస్వభావులల్పములకు వికారమందుదురా? కానియాపరివ్రాజకుఁడుతనయెడనప్పటివారికెల్లరకుఁగలిగినయనాదరమునుబట్టి రాజుమనస్సుచెడెననియు నింక నచటనుండుట సరిగాదనియుఁ దలంచి దండములోనగు తనపరికరములఁ గూర్చికొనుచుఁ బోవనిశ్చయించుకొనెను. రాజదివిని యింకనునాపరివ్రాజకునియెడఁ బ్రేమమిగిలియుండుటచే సవినయముగా నాతని మరలింపఁదలఁచి ఓపరివ్రాజకోత్తమా! ఇట్లకస్మాత్తుగ నీవుపోవఁ దలంచితివి మాయెడఁబ్రమాద మేమయినఁ జూపట్టెనా? యనిప్రశ్నింపఁగా బోధిసత్త్వుఁడు ఓరాజా! నాయీప్రయాణమాకస్మికముకాదు. ఇందులకు నీయనాదరమును గారణముగాదు. నీవిఁకధర్మమున కనర్హుఁడవనియెంచి నేఁబోవుచున్నాఁడనని బదులుచెప్పెను. అట్లువారిరువురు ప్రసంగించుకొనుచుండఁగా నంతలో నారాజన్యునకు మిక్కిలి ప్రీతిపాత్రమగు నొకశ్వానమచటికివచ్చి పరివ్రాజకునిఁ దఱుముఁజొచ్చెను. దానిం జూపి యామస్కరి ఓరాజా! చూచితివా? ఇదిమున్ను నా యెడ మిగులభక్తిగలదియైనను నిన్ననుసరించియుండుటచే నీయభిప్రాయమెఱింగియు నీవలెనాకారగోపనము చేయనేరకనీభావమును సూచించుచున్నది. ఇంకను బొలుపూసినవిషకుంభమువలె నీకపటవినయము నేలచూపించెదవనిపలుకుచుఁ దొలఁగిపోవుచుండెను. అందులకు రాజుమిగులసిగ్గుపడియు నాతనిఁ బరిత్యజించుటకు మనసొప్పమిచేఁ జలమునకిది సమయముకాదనియెంచి సవినయముగా ఓబోధిపరివ్రాజకోత్తమా! తమరె

డ నాయనుచరుల కసూయగలిగి మీాపైఁ గొండెములు చెప్ప
బనిజము. రాజకార్యాతిపాతాదులచే నావలనఁ గొంత యనా
దరము గాన్పించుటయు సత్యము. ఎట్లయినను నాయీ ప్రథ
మాపరాధమును క్షమించి మరలుఁడని పలువిధములఁ బ్రార్థిం
చెనుగాని యాతఁడందుల కంగీకరింపలేదు. అంతటను విడువక
పుడారాజన్యుఁడాతని వెంబడించి దేవా! తమనిశ్చయము మోఘ
మైనచోఁ దమపునరాగమనముచే నన్ననుగ్రహింప వేఁడుచు
న్నాఁడనని కోరఁగా నతఁడో రాజా! ఇట్లుకోరితివిగాని మఱ
లఁగలిసెదమని మేమేమిచెప్పఁగలము. అప్పటి సన్నివేశ మెట్లుం
డునో? మహారాజులు ఫలవృక్షములవలె బహుకంటకాశ్రితు
లై యుందురు. కావున నిట్లొనర్చెదమని ప్రతిన చేయఁజాలము
కాని మేముమఱల రాఁదగిన కారణసామగ్రి సంభవించినచో
రాకతప్పదని చెప్పి యారాజునకు సెలవొసంగి యాదేశమును
విడిచిపోయెను. అట్లు వెడలియు గృహస్థులతోడి చెలిమిని మన
సుకలఁతపడుటచే నొకపవిత్రమగు నరణ్యము నాశ్రయించి యె
ప్పటివలె యోగాభ్యాసము నారంభించెను. అతఁడట్లభ్యసించి
న కొలఁదికాలముననే ధ్యానముచే నన్ని విషయములఁ దెలిసి
కొనఁదగు సామర్థ్యమును సంపాదింపఁగలిగెను. అంతట నొక
నాఁడు దయాళుఁడగు నాపరివ్రాజకుని మనోవీథి నారాజు సం
చరింపఁగా ధ్యానబలముచే నాతనియవస్థను గనిపెట్టెను. మం
త్రులలో నొకఁడాభూవిభుని దురవగాహములగు నిదర్శనముల
చే సృష్టియహేతుకమనియు నదిపక్షుల వెంట్రుకలఁ బలువిధము
లగు రంగులలవడినట్లు స్వభావసిద్ధమనియు బోధించుచుఁ దన



మతమున నాతని నేకీభవింపఁ జేసికొనసాగెను. ఇంకొకఁడీశ్వరు
డే సృష్టికిఁ గారణమనుచు బోధింపఁజొచ్చెను. మఱియొకఁ
డంతకును బూర్వకృత సుకృతదుష్కృతములే కారణములని
యుపపాదించెను. వేఱొకఁడు మన యీవిచారణములతోఁ బ
నియేమి? మానవునాధికి భోగములే ప్రధానములని యుప
న్యసింప మొదలిడెను. వారిట్లు పలువిధములుగాఁ దమతమమ
తముల నాతనినాకర్షింపఁబూనుటయు నందుల కాతనిమనసు
కలఁతనొంది పరితపించుటయు మనపరివ్రాజకునకు ధ్యానగో
చరమయ్యెను. అపుడతఁడు అయ్యో! ఈరాజు దుర్జనసంపర్క
మున వివేకము చెడి 'మూఢః పరప్రత్యయనేయబుద్ధిః' అను మ
హాకవికాళిదాసు సూక్తిచొప్పునఁ దానొకమార్గము నరసికొన
లేక చిక్కువడుచుండెనే? దీనికిఁ బ్రతీకారమెద్దియని కొంతతడ
వుచింతించి యిప్పటికిదిపోలియున్నదని తనమంత్రబలముచే నొ
కగొప్పవానరమునుగల్పించి దానిచర్మమునుగప్పికొని యాభూ
నాథుని గృహద్వారమునుజేరెను. అంతట నాతనిరాకను దౌ
వారికులారాజునకెఱిఁగించి రాజానుమతిచేఁ గొలువుకూటమున
కుఁ దోడ్కొనిపోయిరి. అందు రాజు తనపరివారమెల్లఁ గొలువ
నిండోలగము దీర్చియుండెను. అట్లాపరివ్రాజకుఁడా కొలువుకూ
టమునకుఁబోయి యాభూనాధునిచేఁ బలువిధములగు సత్కా
రములనొంది యుచితాసనమునఁ గూర్చుండియుండెను. పిమ్మ
టఁ గుశలప్రశ్నపూర్వకముగ నారాజన్యుఁడంతటి విశాలమగు
వానరచర్మమెట్లు లభించెనని పరివ్రాజకునిఁ బ్రశ్నించెను. అం
దులకా పరివ్రాజకుఁడో రాజా! తృణమాత్రమాస్తరణమగుట

చేఁ గఠినమగు భూమిపైఁ గూర్చుండుటకును బరుండుటకును శరీర మొప్పక సుఖముగ ధ్యానాదులుజరుగుటకై యీమహావానరచర్మమును స్వయముగనే సంపాదించితిని. పరుండుటకిది రాజశయనములకన్న సుఖదాయకమని చెప్పుటకు సందియము లేదని బదులుచెప్పెను. అదివిని రాజేమియుననక వెనుకఁదానొనర్చిన యనాదరమునకు లజ్జనందుచు ముఖమువాంచియూరకుండెను. పిమ్మట నాతనిమంత్రులు మున్నగువారాపరివ్రాజకునిపై నసూయగలిగియుండుటచే నాతనిసవజ్ఞసేయుటకుఁ దగుసమయము చిక్కెనని పరిహాసపూర్వకముగ రాజుతో ఓ దేవా! చూచితివా ఈమహాభాగ్యునిధైర్యము. ధర్మతత్పరత్వము. కార్యచాతుర్యము. ఇట్లీతనిమేను కృశించినను దనయాశ్రమమునుజేరిన వానరమును జంపఁగలిగెను. కావునఁ దప్పకయీతనికిఁ దపస్సిద్ధియైయుండునని యూహింపనచ్చునని పలికిరి. అందులకాపరివ్రాజకుఁడు త్వరపడక ఓపూజ్యులారా! మీమీయభిప్రాయములకు విరుద్ధములగు ప్రసంగములచే నన్నునింధించుచున్నారు. ఇది పాండిత్యయశమును సంపాదించుటకుఁ దగినక్రమముగాదే! చూడుఁడు. మీలోనొకరు స్వభావవాదమును జేయుచున్నారు. కావున నేనొనరించినదెల్ల స్వభావమేకాని యిందునాదోషమేమియు లేదుగదా? మఱియొకరీశ్వరుఁడే యంతకునుగారణమని చెప్పుచున్నారు. ఈవానరనాశమునకు నయితమాయీశ్వరుఁడే కారణమనినచో వారేమి బదులుచెప్పుదురు. వేఱొకరుకార్యమాత్రమునకెల్లఁ బురాకృతకర్మమే కారణమనుచున్నారు. అట్లయినచో నీవానరము తనపూర్వక



ర్మముచే మడసినది. అందులకువారు నన్నధిక్షేపింపఁ బనియేమున్నదని పలుకుచు స్వప్రతిభావిశేషముచేఁ దక్కినవారిని సయితమిట్లే తగినయుత్తరములచే నిరుత్తరులనుగాఁజేసి యోడించి మఱియు నతఁడారాజుతో ఓమహారాజా! ప్రాణియగు నీవానరము నాచేఁజంపఁబడలేదు. ఇదికల్పితవానరచర్మము ఇపుడుజరిగిన కథాక్రమమునకిది ప్రస్తావముగాఁ దెచ్చితిని. కావున నన్నుఁ బ్రాణిహింసకునిఁగాఁ దలంపకుము. అట్లుగానిచో నింతటి వానరచర్మమును గనివిని యెఱుంగుదువా! యనిపలికెను. అందులకా రాజమితాశ్చర్య హర్షపరవశుఁడయ్యెను. అమాత్యులును దమతమ వెనుకటి యసూయలను విడిచి యాతనియెడమిగుల భక్తినెఱపిరి. పిమ్మట నాకొలువునందున్నవారికెల్లరకుఁ బరమానంద మొదవించునట్టివియు ధర్మసంశయముల నడంచునట్టివియునగు నుపన్యాసములొసంగి యందఱనుతులకుఁ బాత్రుఁడై యచటనుండియే యంబరవీధికేఁగి వెనుకటితనయరణ్యాశ్రమమును జేరికొని కైవల్యమార్గమునకదూరముగఁ దనకాలమును గడపెను.

ఇట్లు పండ్రెండవదగు మహాబోధిజాతకము ముగిసెను.

## 13-వ కథ. మహాకపిజాతకము.

మహనీయులగు పురుషులు తమయాపదలనయినను లెక్కింపరుగాని, తమకపకార మొనర్చినవారికైనను గుశలభంగమగుననినచో నందులకు సమ్మతింపరు. మనబోధిసత్త్వుఁడు

పర్వతములలో నెల్ల మిక్కిలి ప్రసిద్ధి వడసి కొండలరాయఁడను పేరుగాంచిన హిమవంతమునఁ జేరువఁ గాంతారము నివాసముగా నొకమహాకపియై యవతరించెను. ఆయడవి హిమవత్పర్వతమున నొకభాగమై జేవురుమన్నగు పలువిధములగు రంగులు గలిగి నల్లనిఛాయావృక్షములచే నంగరాగమునుబూసికొని నీలిచీరగట్టికొనిన వనలక్ష్మికి నిలయమన్నట్లలరారుచుండెను. మఱియు నందొక్కచోటు మిగులలోతుగ నగపడులోయలును వానికిరుప్రక్కలఁ బెద్ద చఱియలును వానిపైఁ బలువిధములగు ఫలవృక్షములునుగలిగి నానాజాతిమృగములకును నివసింపఁదగియుండుటయే కాక మనోహరములగు మందమారుతములను సేవించుటకై యప్పుడప్పుడచ్చోటకువచ్చు విద్యాధరులుమున్నగువారికయ్యది సుఖదాయకమై యుండెననుటకు సందియము లేదు. అట్టి మహావనమున కలంకారమై వానరములకధినాథుడనఁదగి యమ్మహాకపి యందుఁ దిరుగుచుండెను. కానియీ జన్మమునందుసయిత మా మహానుభావుఁడు దయాదాక్షిణ్యములందించుకేనిఁ గొఱంతలేక పరోపకారబుద్ధితో మెలఁగుచు వచ్చెను. మఱియు నమ్మహాకపికిఁ దాపసులకువలె నాయుష్షని ఫలపర్ణములాహారముగాఁగ జీవించుచుఁ గారణాంతరములచే నచ్చోటికివచ్చు ప్రాణులనాదరించుటయె పనియై యుండెను. పిమ్మట నొకప్పుడొకపురుషుఁడు నష్టపోయిన తనగోవును వెదకుటకై యెల్లచోటులందిరుగుచుఁ ద్రోవతప్పి దిక్కులు తెలియక మనయిమ్మహాకపియున్న యడవిప్రాంతమును జేరికొనియెను. ఆపురుషుఁడు రెండుమూడుదినములనుండి సరియగు నిద్రాహా



రములులేక తిరుగుచు బడలుటచే నాఁకలిదప్పులు తన్నుమిగుల బాధింప నతఁడొక చెట్టుమొదటఁ గూర్చుండి యాహారమునకై నలువైపులఁజూచుచుండెను. అంతట నాచేరువనొక చో మిగులఁబండి పైనుండిరాలిన పచ్చని తుమ్మిపండ్లాతని కంటఁబడెను. అతఁడవిచూచి పెన్నిధిలభించినట్లు సంతసించుచు, వానినిదీసి యాస్వాదించి యవియింకను దనకెట్లులభించునో యని వెదకుచు రాఁగా నున్నతమగు నొకచఱియపైఁబుట్టి పండ్లతోనిండిన యొకతుమ్మికిచెట్టగపడెను. అపుడాపండ్లపై నాతనికిఁగల యాశవదలక యెట్టెటో యాచరియనెక్కి దానిపైకి వంగియున్న యొకకొమ్మపైకిదుమికి పండ్లుగల యాతుమికి చివరకుఁ జేరఁబోయెను. అపుడాపురుషుని దురదృష్టవశమునఁ గొంచెమల్పముగానున్న యాకొమ్మవిఱిగి పెళపెళమను చప్పుడుతోఁ గ్రిందమిగుల లోతగు లోయలోఁబడెను. అట్లుపడిన యాకొమ్మనంటి కదలక దానితోడనే యతఁడునుబడెను. కాని యింకను నాతనికి నాయుశ్శేషముండుటచేఁ బ్రాణహానిమాత్రము గలుగలేదు. అగర్త మాకులతోడను జలముతోడను నిండియుండుటచే నంగభంగము సయితమునొందక యతఁడు మెల్లగలేచి దానినుండి వెడలుటకుఁ బలువిధములయత్నించియు విఫలమనోరథుఁడై నలుదిక్కులఁ జూచుచుండెను. ఆహా! అట్టిదురవస్థలో నాతఁడేమిచేయఁగలఁడు. ఇఁక దైవమే తోడ్పడవలయు ననియు లేనిచోఁ బ్రాణములయెడ నాశవిడుచుకొనవలయుననియు నిశ్చయించుకొని యచటరాలిన పండ్లుదిని నీరు ద్రావుచు జీవింపఁగలిగి యుండెను. అప్పటి యాపురుషుని

దైన్యమూహింపవలసినదేగాని చెప్పనలవిగాదని పెక్కువ్రాయ కూరకుంటిని. అకారణకారుణికుఁడును నాపదుద్ధారకుఁడును నగు నాపరమేశ్వరుఁడు దిక్కుమాలియున్న యీతనివిడుచునా? అట్లుపలువిధములఁ గుందుచున్న యాతనికి దేవునివలె నాహారమునకై తిరుగుచువచ్చిన మనమహాకపి వానిరోదనము వినియీమహారణ్యమున మానవుని రోదనమునకుఁగారణమేమై యుండునని యటునిటుచూచెను. అపుడా చఱియక్రిందిలోవలోఁ గృశించియున్న యొడలితో నేడ్చుచున్న యొకపురుషుఁడాతనికంటఁబడెను. పిమ్మట యమ్మహాకపి యమ్మానవునిదైన్యమునకు మనసుకరఁగి యాహారఫలముల నాలోవలోనికిఁ బడవైచుచు మానుషభాషతో అయ్యా! మీరెవరు? పురుషులు చొఱరాని యీమహారణ్యము నెట్లుచొచ్చిరి? ఎందులకని ప్రశ్నించెను. అనంతరమా పురుషుఁడా కపివర్యుని వచనము లమృతమయములై చెవింబడ నమస్కరించి సవినయముగా ఓమహాభాగా! నేనొకమానవుఁడను. ఈయడవిని దిరుగుచుఁ ద్రోవతప్పి యాహారఫలాశచే నీతిందుకీవృక్షమారోహించి నాయభాగ్యవశమున నది విఱుగ నీకూపమునఁబడి యీయాపదకుఁ బాలైతిని. నాపాలిటిదైవమువలె నీవిచటికివచ్చితివి. కావున నన్నురక్షించుటకు నీకంటె వేఱు బంధుగులు లేరని వేడుచున్నాఁడనని గట్టిగా మొఱపెట్టుకొనెను. అదివిని మిగుల దయాళుఁడయిన మనకపి ఓమానవా! నీకెవ్వరును బంధుగులులేరని చింతింపకుము. నాచేనయినంతవఱకు నీకుఁ దోడ్పడెదనని యోదార్చి యించుమించుగా నాపురుషునంతటి



పరిమితిగల పాషాణమొకటి మోచి తనబలమును బరీక్షించుచుకొని యాలోవలోనికి దుమికి యాతనితో ఓయీ! నాయీమూపున నధిరోహింపుము. 'పరోపకారార్థ మిదంశరీరం' అనుసూక్తి చొప్పున నా దేహమునకుఁ బరోపకారము కంటెఁ జేయఁదగినపని యేమున్నది? కావున సందియం పడకుమని పలికెను. అనంతర మప్పురుషుఁ డందుల కమందానంద భరితుఁడగుచు నామహాకపి మూపుపై నధిష్ఠించెను. పిమ్మటనామానవుని దేహము మిగులభారమై తనకుఁగొంతశ్రమ గలిగించుచున్నను వెనుకంజవేయక వెనుక శ్రీరాముని మోచిన యంజనానందనుని చరిత్రమును స్మరింపఁజేయుచు మెల్లగానాకపిశ్రేష్ఠమాతని నొకరియొద్దనఁజేర్చి నున్నని చఱియపైఁ బరుండఁబెట్టెను. అట్లాతఁడా ఱాతిబండపైఁ గొంతతడవువిశ్రమించిన పిదప వానితో ఓమిత్రమా! నిన్నిందుఁ దెచ్చుటచే మిగుల బడలితిని. ఈయరణ్యము క్రూరమృగములకు శరణ్యమైయున్నది. ఇట్టిదుర్గమారణ్యమున నెట్టివారును మిగులజాగరూకులయి మెలంగనిచో నొకప్పుడు ప్రమాదము వాటిల్లును. కావున నీవొకముహూర్తమాత్రము మేల్కనియుండుము. నేను నిద్రించెదనని యమ్మహాకపి పలికెను. అనంతరమా తెరువరి చిత్తముచిత్తమట్లే జాగరూకుఁడనై యుండెదనని యందులకంగీకరించెను. అమాయకుఁడును సుగుణసంపన్నుఁడును నగు నామహాకపి తనచేనుపకృతుఁడగు నాపురుషుఁడు తన్నుఁదప్పక రక్షించునను నమ్మికతో మైమఱచి గుఱువెట్టినిద్రింపసాగెను అతఁడట్లాతని విశ్వసించుటలోఁ బొరపాటులేదని మనకును జె

వ్వకతప్పదుగదా ! ఆపురుషుఁడుమాత్రము మేల్కొనియుండెను. పిమ్మట నామార్గస్థున కెవ్వతె ననుకొనని యొకదుర్బుద్ధి జనించెను. ఒంటరిగానున్నపుడు మానవస్వభావమును బట్టి పలువిధములగు నాలోచనలు గలుగుట వింతకాదు. అపుడా పురుషుఁడు అయ్యో ! నేనిల్లువెడలి పెక్కుదినములుగడచెను. వన్యములగు ఫలమూలములను మాత్రమే తినుచుండుటచే మిగులదేహము కృశించి బలముచెడినది. మిక్కిలి దూరమగు న్నదేశమున కెట్లు పోఁగలుగుదును. మాంసాహారముచేఁ గాని మరలనా దేహమునకుఁ బాటవము సంభవింప నేరదుగదా ! అని యిటునటుచూచి, యీమహాకపి యెంతయు బలిసియున్నది. దీని దేహమాంసము నాకుఁ బుష్కలముగాఁ జాలియుండును. మఱియునిది గాఢనిద్ర నొందియుండుటచే ననాయాసముగ లభించెను. 'సిరిరామోకాలొడ్డు' నన్నట్లు వెఱ్ఱివెఱ్ఱియాలోచనలచే దీనినిపుడు విడుచుకొననేటికి ? అని యమ్మహాకపికి ద్రోహముచేయందలంచి దానిపైనొకపాషాణమును బడవైచెను. అట్లుమహోపకారియగు నాకపివర్యునకుఁ బ్రాణహాని గలుగఁబోవుచుండఁగా నాపరమేశ్వరుఁ డుపేక్షించునా ? ఆదుష్టుఁడు వైచిన పాషాణమాకపివర్యుని శిరముపైఁబడక కొంచెము ప్రక్కకుజారి విశ్వాసఘాతియగు నాపురుషుని దౌర్జన్యము నెఱింగించునట్లాతని మేల్కొల్పెనుగాని యాతని ప్రాణహానికి హేతువుకాఁజాలకపోయెను. పిమ్మట నమ్మహాకపి యాయల్పప్రహారముచే మేల్కొని యటునిటుచూడఁగాఁ దనచేమహోపకారమొందిన పురుషుఁడుతప్ప, వేఱొకరాతనికిఁ గానరారైరి.



కావున నాపురుషుఁడే ద్రోహము చేయందలంచెనని యాకపిశ్రేష్ఠుఁడు నిశ్చయింపవలసి వచ్చెను. అతఁడు మిగులగంభీరుఁడును దయాళుఁడునగుటచే సిగ్గుచేఁ దెల్లవోవుచున్న యాపురుషునిఁజూచి ఓమానవా ! నీవు భయపడకుము. నీకేమియు నేనపకార మొనర్చువాఁడను గాను. కాని నీకుఁగలిగిన దుశ్చింతకుమాత్ర మెంతయుఁ జింతించుచుంటిని. ఓయీ ! ఇఁకనయిన నిట్టిదుశ్చేష్ట లొనరింపకుమని గురువుశిష్యునకువలెఁ హితముపదేశించి యాయడవి వెలుపలకుఁ దెచ్చి విడిచెను. వాఁడునుదానొనరించిన మహాపాపమునకుఁ బశ్చాత్తాపపడుచు నాపాపఫలము రూపమొందెనన్నట్లు తనదేహమున నపుడే వ్యాపించిన కుష్ఠువ్యాధిచే రూపముచెడి యందందుఁ దిరుగుచుండెను. వాఁడెచటికిఁబోయినను వానిఁజూచువా రందఱును నసహించుకొనుచుండిరి. అట్లుసర్వజనహేయమగు తనదుస్థితికిఁ వాపోవుచుఁ జేయునదిలేక వాఁడరణ్యప్రాంతములఁ దిరుగుచు జీవింపఁ దొడఁగెను. అట్లుండఁగా నొకనాఁడా పాతకియున్న యడవులకు వేఁటకై యొకభూనాయకుఁ డరుదెంచెను. వారిరువురు నిట్లుప్రసంగించిరి.

రాజు—ఓరీ ! నీవెవ్వఁడవు ? ఇట్లు కుష్ఠవ్యాధిచేఁ బీడింపఁబడుచుండియు దిక్కులేక నీయడవి నిడుమలఁ బడుచుంటివేల ? అనిప్రశ్నించెను.

పురు—(చేతులుమోడ్చి దీనస్వరముతో) ఓమహారాజా ! నే నొక మహోపకారమొనర్చిన మిత్రునకుఁ బ్రాణ

హాని చేయఁదలఁచిన పాపుఁడను. ఆపాపమను వృక్షమునకిది పుష్పము. ఫలమింకను ననుభవింపవలసియున్నదని తనదుశ్చరితమంతయు విస్తరించి చెప్పికొనెను.

పిమ్మట నారాజు మిత్రద్రోహమువలన నెట్టికష్టములును సంభవించుట వింతకాదని తలంచుచు వేఁటచాలించిపోయెను. కాలక్రమమున నాపాతకియుఁ గాలునిపాలయ్యెను. కావునఁ గృతఘ్నతవంటిదోషము మఱొండు లేదని యూహింపఁదగియున్నది.

ఇట్లు పదమూఁడవదగు మహాకపిజాతకము ముగిసెను.

## 14-వ కథ. రురుజాతకము

సాధువులు దమకెట్టియిక్కట్టులువచ్చినను సహింతురు గాని యొరులకష్టములకుమాత్రమోర్వఁజాలరు. బోధిసత్త్వుఁడొకప్పుడొక మహారణ్యమున నొకపురుషమృగమై యుద్భవించెను. ఆయరణ్యము పలువిధములగు శింశుపాది మహావృక్షములచే నతిగహనమైయుండుటచే నడవిజాతి మృగములకు మిక్కిలి నివాసయోగ్యముగా నుండెను. మఱియు నాయడవి యొకపర్వతము నంటియుండుటచే పైనుండి క్రిందకుఁ బ్రవహించుచు నడుమఁ గొండచఱియల మీఁదుగాఁ బాఱి కలుషమెడలిన స్వచ్ఛమగు జలముగల నదులచే మిగుల రమ్యముగా నుండెను. కావుననే చమరవృషభాది మృగములకునయితమది తానకమై యుండెను. బోధిసత్త్వుఁడొక మృగరూపముతో



నాయడవిని బలువన్నెల పొడలును విశాలనేత్రములును గలిగి ప్రాణికోటికెల్ల దర్శనీయమనఁదగి మాయలను విడిచితిరుగు మారీచుని మృగరూపమును స్మరింపఁ జేయఁజాలి యుండెను. అయ్యది తనదేహము బలహీనమనియుఁ జూచువారలకుఁ గోరఁదగినదియుఁగాఁ దెలిసికొని నిర్జనారణ్యములందుఁ దిరుగుటయేగాక వంచకులగు నెఱుకలు పన్నుచుండెడు వలలు మున్నగు వానిలోనున్న యాహారముల నపేక్షింపక జాగరూకతతో మెలఁగుచుండెను. అచ్చటి మృగజాతులన్నియు నామృగరూపధారియగు బోధిసత్త్వుని యుపదేశములను వినుచుఁ దమకాతని రాజుగా భావించి ప్రవర్తించుచుండెను. అనంతర మొకసమయమున నొకమహాగహనమగు నరణ్యమున నతఁడు సంచరించుచుండఁగా సమీపమందున్న యొకనదిలోఁ గొట్టుకొనిపోవుచున్న యొకపురుషుని యార్తధ్వనియాతని చెవినిబడెను. అదియేమోయని యామృగము నలువైపులఁ జూచెను. మిగుల వేగముగఁ బాఱుచున్న యన్నదిలో నొకపురుషుఁడు ఓదీనవత్సలులారా! జాలము చేయఁదగదు. దిక్కులేదు. నా యసువులఁగాపాడి పుణ్యముగొనుటకుఁ దగినసమయ మిదియేయని మొఱవెట్టుచుండెను. ఆ మొఱ బోధిసత్త్వునకు గుండియపైఁ దట్టినట్లు కాఁగా మనుష్యభాషతో భయపడకుభయపడకుమని బిగ్గఱగాఁబలికెను. ఆపలుకులాపురుషునకుఁ బరమానందమొదవించెను. అంతటనదిలోఁ గొట్టుకొనివచ్చుచు ననతిదూరమున నప్పురుషుఁడగపడెను. అపుడు బోధిసత్త్వుఁడింక జాలము సేయఁదగదనియెంచి మహావీరుఁడు శత్రుసేనామధ్యమునఁ

కొప్పునట్లు ప్రాణములకు వెనుదీయక మిగులవేగముగాఁ బ్రవహించు నానదినుండి వానినుద్ధరించు నిశ్చయముతో నందుఱికెను. అట్లుఱికి వానికడ్డముగాఁబోయి ఓయీ! నన్నుఁబట్టుకొనుమని చెప్పఁగా వాఁడమితానందముతో నాలేడివీఁపుపై నెక్కి కూరుచుండెను. ఆపురుషమృగము మిగులసాహసముగలదగుటచే బలిష్ఠమైనది గాకున్నను నాపురుషునిఁ బ్రమాదములేకుండ ననుకూలముగ నానదీకూలమును జేర్చి మఱియుఁ బ్రియవాక్యములచే నోదార్చి త్రోవచూపి పొమ్మనివిడిచెను. అనంతరమా పురుషుఁడా మృగ మొనర్చిన మహోపకారమున కెంతయు సంతసించి నమస్కరించుచు ఓమహానుభావా! నాకీవొనర్చిన యుపకృతి యిట్టిదని వచింపఁజాలను. బాల్యమునుండి పరమమిత్రుఁడగు వాఁడుసయితము తనకుఁ బ్రాణసాయమగు నిట్టియుపకార మొనర్పఁడని తలంపఁజాలను. సాధారణముగ నదీవేగహతుఁడగువాఁడు తన్నుద్ధరించుటకు వచ్చినవాని ప్రాణహానిని శంకింపఁడనుట యెఱింగియు నీవందులకు సందియింపక నన్నురక్షించితివి. కావుననాయీ ప్రాణములు నీవనిభావించి నేఁజేయఁదగు సేవలను నియోగించి నన్నుఁబంపవేఁడుచున్నాఁడనని సవినయముగ మనవిచేసెను. అదివిని మృగరూపధారియగు బోధిసత్త్వుఁడు ఓమిత్రుఁడా! సజ్జనులగువా రుపకారులయెడఁ గృతజ్ఞతచూపుటవింత కాదు. అదివారికి సహజము. అయినను బలువికారములుగల యీ లోకముంబట్టి కృతజ్ఞతయు నొకసుగుణమనియే గణింపవలసియున్నది. కావున నేనొకటిచెప్పెదను. ఇట్టిరూపముగల మృగ



ముచే నేనట్లురక్షింపఁబడితినని మాత్ర మెవరుల కెఱిగింపకుము. మఱియునాయునికిపట్టు ప్రకటింపకుండుమదియే నీవొనర్పఁదగు మహోపకారమని భావించెదను. ఓమిత్రుఁడా! ఏమిట్లనుచున్నాఁడవని నీవడుగ వచ్చును. చూచితివిగదా? నాదేహమతి లోభనీయము. మఱియుబలహీనము. మనుష్యుల హృదయములు దయాశూన్యములనుమాట నీవెఱుంగనిది కాదుగదా! ఇట్లంటినని కోపింపఁదగదు. ఆత్మరక్షణకై యిట్లు చెప్పుకొనవలసి వచ్చినది. కావున నీవీయుపకార మొనర్పఁజాలును పొమ్మనిచెప్పి యాతనికి సెలవిచ్చెను. వాఁడునునట్లేయని యొడంబడి మరలమరలనమస్కరించి తనగృహమునకుఁ బోయెను. మఱికొన్ని కొలఁది దినములకే యాదేశపురాజు పట్టమహిషికి స్వప్నమొకటి కలిగెను. ఆమె కెపుడేయేకల వచ్చినను నదిశుభాశుభములకు నిజమగు సూచకమై కానిపించుచు వచ్చునఁట. మఱియు నపుడామె తెల్లవారుజామున నొకపురుషమృగము పలువన్నెలుగల మేనికాంతితో సింహాసనముపైఁ గూర్చుండి కొలువుదీర్చి యున్నట్లును స్పష్టమగుమనుష్యభాషతో రాజధర్మముల నుపన్యసించుచున్నట్లును గలఁ గాంచి తనభర్తను మేలుకొలుపు నగారాచప్పుడులచే మేలుకొని సవినయముగ భర్తకడ కేఁగి యాశ్చర్యమును దెలుపు చూపులతోఁ దనస్వప్నవృత్తాంత మంతయు నిట్లుచెప్పెను. ఓనాథా! నాకొకస్వప్నముకలిగెను. అందొక పురుషమృగమగపడెను. దానిచక్కఁదన మిట్టిదని చెప్పఁజాలను. దానిని జూచితీరవలయును. అదిమనయంతఃపురమున నుండఁదగినదని

మాత్రము చెప్పఁగలను. కావున దాని నెటులయినఁ దెచ్చి మనయంతఃపురము నలంకరింపుమని యామె తనమగనిఁ బ్రార్థించెను. పిమ్మట నారాజు తనప్రియపత్నిగాంచిన కలలు సత్యములగుటచే నట్టిమృగము తప్పక యుండుననియు నామె యెన్నఁడును దన్నట్టికోర్కెలను గోరలేదనియుఁ దలంచి యామృగము నెట్లయినఁ దేవలయునని కొందఱఁ గిరాతుల కాజ్ఞాపించెను. కాని స్వప్నఫలమునుబట్టి మృగమేయుండినచో దానిచేఁ దనరాజ్య మపహరింపఁ బడుటగూడ సత్యమగునని యతఁడేల తలంపలేకుండెనో సందియము గలుగకమానదు. కాని భవితవ్యతనుబట్టి వానికట్టి సందియము గలుగక పోవచ్చును. అట్లు కిరాతుల కాజ్ఞాపించుటయెగాక తనపురమున; ఓపౌరులారా! వినుఁడు. బంగారుకాంతిగలిగి మణిఖచితమగునదివోలె నున్నట్టియుఁ గలలో నొకరిచేఁ జూడఁబడినట్టియు నొక మృగముకలదు. అట్టిదాని నెవ్వరయినఁ జూపింతురేని వారికొక యుత్తమ గ్రామమును గోరినకాంతా కనకాదులను మనరాజోత్తముఁడొసంగుననియిందుమూలముగాఁ దెలియఁజేయఁబడుచున్నదని చాటింపించెను. ఆఘోషణ మనమృగరూపధారియగు బోధిసత్త్వునిచే నుపకృతుఁడగు బ్రాహ్మణుని చెవిని బడెను. అపుడు వాఁడావృత్తాంతము తనమిత్రమగు మృగమును సంబంధించినదేయని తెలిసికొని ఆహా! నాకీ పురుషమృగము మహోపకార మొనర్చిన పరమమిత్రము. దీనిని జూపినవారి కీపట్టపురాజు గ్రామమొకటి బహుమతిగా నిచ్చునఁట. నేనిప్పుడేమి చేయఁదగి యున్నది? ధనమా? లేక



గొనమా? యిపుడవలంబింపఁ దగినది? ఉపకారము నాలోచింతునా. సంసార వారినిధి తరణసాధనమగు ధనముచెడును. పరముచెడునని యూహింతునా, ఇహము గడచుట దుర్ఘటము. అట్లనిసంపదల కాశింతునేని దుష్కీర్తి తప్పదు. కావునఁబ్రకృతఫలమునుజింతింతునా లేక యుత్తరకాలఫలమపేక్షింతునాయని హృదయము డోలాయమానముగా నాలోచించెనుగాని యాకృతఘ్నుని యాలోచనాస్వప్నమునదురాశ, యను గురుదేవత ప్రత్యక్షమై 'ధనమూలమిదం జగత్త'ను మహామంత్రము నుపదేశించెను. కావుననతఁడర్థము సకలార్థసాధనమనియు దానివలన నెట్టిపాపములనయినఁ బోగొట్టుకొన నగుననియు నిశ్చయించి యామృగముండెడిచోటు నారాజునకెఱిఁగించుటకై రాజుసన్నిధికిఁబోయెను. ఆహా! ధనమెంత పాపిష్ఠమో చూచితిరా? పాపిష్ఠమేగాదు. పాపిష్ఠతమమగునని చెప్పవచ్చును. లోకములోఁ దమ్ముఁగడుపారఁగని చేతులారఁ బెంచిన తలిదండ్రులతోడనే యీధనము కలహము గలిగించును గదా! నడుమ వచ్చిన మిత్రులపై దయదల్పనిచ్చునా? అట్లా కృతఘ్నుఁడా రాజుకడకేగి 'ఓరాజా! మిగుల గంభీరమగు తిమహృదయమును సయిత మాకర్షించిన యాబంగరువన్నె మృగము తిరిగెడు చోటుల నేనెఱుంగుదును. కావునదాని నెవ్వరికిఁ జూపింతుమందురో సెలవొసఁగుఁడని చెప్పెను. కానియాతని మనసుమాత్రమాతనిఁ దిట్టకపోలేదు. అదివిని యారాజు పరమానంద భరితుఁడై ఓయీ! ఆవింత మృగమునుజూడనేనేవచ్చెదననిపలికి వేఁటకనువగు వైభవమును

ధరించి తగుపరివారముతో బయలువెడలి యాపురుషుఁడు చూపిన తెఱవునఁబోవుచుఁ బురమునుదాటి యామృగము చరించు నదీతీరమును జేరికొని క్రమక్రమముగా నడవిఁజొచ్చి సేనల నలువయిపుల నిలిపి నట్టడవి కాపురుషాధముని వెంట నంటిపోయెను. అంతటనొకచో నామృగమాపురుషుఁడు కొంత పరిచితుఁడయినట్లగపడుటచే బెదరకనిలిచి యాతనికంటఁ బడెను. వాఁడును దానింజూచి ఓరాజా! చూడుము చూడు మదిగో మనము గాంచవచ్చిన బంగారమృగము. పట్టుకొనుఁడు జాలముచేయకుఁడని చేయెత్తి చూపసాగెను. కాని యదేమి చిత్రమో? ఇంద్రజాలమువలె వాఁడట్లు చూపునంతలోనే వానిబాహువునుండి హస్తము తెగి చట్టునజారి నేలఁబడెను. 'అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవఫలమశ్నుతే' అనుసూక్తి కల్ల యగునా? పిమ్మట నారాజాపురుషుఁడు చూపిన మార్గమును బట్టిపోవుచు దానిని గన్నులారఁ జూచెను. అప్పుడా మృగమా భూపాలునిహృదయము నాకర్షించుటచే నతఁడుదాని నెటులయినఁ బట్టుకొనఁదలఁచి ధనుర్బాణములను ధరించి నిలుచుండెను. పిమ్మట నామృగమప్పటి కోలాహలముచే నలువయిపులు చూచుచుండఁగాఁ దన్నెవరో పట్టుకొనుటకై యావరించి యుండిరని దానికిఁ దెలిసి మనుష్యభాషతో నిట్లుస్పష్టముగాఁ బలికెను. ఓరాజా! నిర్జనమగు నీమహారణ్యమున నాయునికి మీకెవ్వరెఱిఁగించిరో తెలుపుఁడు మఱియు నాతోడ వినోదింపఁ దమకుఁగుతూహలము గలదేని యట్లొనర్పవచ్చును. కాని నన్నుమాత్రము చంపవలదని పలికెను. అదివిని యాభూనా



థుఁడు కేవల రూపమునకేగాక దానిమధురోక్తులకును రెట్టించిన యద్భుతానందము లొందుచుఁ దనకామృగమునుజూపిన పురుషుని బాణాగ్రముతోఁ జూపించెను. పిమ్మట వానినామృగము గుఱుతుపట్టి నిందించుచు అహా! ఎంతకష్టము! నీవిట్టి కృతఘ్నుఁడవగుదువని యెఱుంగనయితిని. మఱియునిట్టి సందియమందియే నాయునికి నొరులకెఱిఁగింపవలదని మున్నుగఁ జెప్పియుంటిని. అట్లుచెప్పినను నీదగుదౌష్ట్యమును విడువవయితివి. నీయెడ నేఁబడిన శ్రమమునకిదియా ప్రత్యుపకారము? చాలుఁజాలునని సరోషముగాఁ బలికెను. ఆమాటలువిని, యారాజోత్తముఁడు ఈమృగమెవ్వరినో నిందించుచున్నట్లున్నదేయని యనుకొనుచు ఓమృగోత్తమా! నీవతిగంభీరవచనములతో నెవ్వనినో నిందించుచున్నట్లున్నది. నీనిందకుఁ బాత్రుఁడెవ్వఁడో వినఁగోరుచున్నాఁడను. వినఁదగి యుండెనేని చెప్పుమనికోరఁగా నామృగము ఓరాజా! ఇది నామిత్రమగు నొకపురుషునకు హితముపదేశించుటగాని నిందగాదు. నన్నియరణ్యమున నీకెవ్వఁడు చూపెనో యట్టియితఁడు ప్రవాహమునఁ గొట్టుకొనిపోవుచుండఁగా జూచి వీనికిఁబ్రాణాపాయము లేకుండఁగాఁ గాపాడితిని. అట్టివానిచే నాకీయపాయము సంభవింపనున్నది. అహా! దుర్జనులకొనర్చిన మేలు హానికరమగుటవింత కాదనిపలికెను. అనంతరమా రాజోత్తముఁడు కన్నులెఱ్ఱచేసి ఓరీ! ఈమృగముచే నీవు రక్షింపఁబడుట సత్యమాయని యడిగెను. అందులకు వాఁడు వెలవెలఁబోయి సిగ్గువడుచుఁగాదనఁజాలక సత్యమేయని బదులుచెప్పెను. అదివినినతోడనే రాజు

నకు మనసుమాఱి మిగులఁ గోపముతో ఛీఛీమూర్ఖుఁడా!
ఇంకనా యెదుట నిలువఁబడకుమని కసరుచు బాణము ధన
స్సున సంధించి వానిఁజంప నుద్యుక్తుఁడయ్యెను. ధర్మపథప్రవ
ర్తకులగువారు స్వాభీష్టసిద్ధులయందును న్యాయముఁ బరిశీలిం
పక మానరుకదా. అదిచూచి బోధిసత్త్వుఁడా పురుషుని పై
బడఁదలఁచి వారిరువురినడుమ నిలిచి ఓమహారాజా! వలదు
వలదు. చచ్చినవానిఁ జంపఁ బ్రయోజనమేమి? ఈతఁడు
లోభమను శత్రునకుఁ బూర్ణముగ నోడుటచే ధర్మహానియుఁ
గీర్తిహానియుఁ గలిగి పరితపించుచున్నాఁడు. అయ్యో! కొం
దఱుమానవులు దారిద్ర్యబాధను సహింపలేక సంపదలఁగోరి
ఫలమను భ్రాంతిచే దీపముపైఁబడి నశించెడు మిడుతలవలె
నశించుచుండుటకు నేనెంతయుఁ జింతించుచున్నాఁడను. కా
వున వీనిపైఁ గోపమును విడువుము. నేనిదే నమస్కరించు
చున్నాఁడనని పలికెను. అనంతరమా రాజన్యుఁడట్లు ప్రత్య
క్షముగ మహోపకారమొనర్చిన యానీచపుఁబురుషునిపైఁగూడ
నావిధముగ దయఁదలఁచిన యామృగముయొక్క సచ్ఛీలము
నకుఁ బరమాద్భుతమందుచు సగౌరవముగ ఓమహానుభావా!
నీయట్టి యద్భుతచరిత్రు నెన్నఁడును వినికని యుండలేదు.
సద్గుణములచే నీవేమనుష్యుఁడవు. మేమాకృతి మాత్రముచే
మనుష్యులమని చెప్పవలసియున్నది. మఱియు వీఁడు దుర్జనుఁ
డయ్యును నీదయకుఁ బాత్రుఁడగుటయు నీదర్శనము నాకు
లభించుటకు హేతువగుటయుంబట్టి వీనికివలయు కోర్కెను,
నీకు నా రాజ్యాధిపత్యమును నిదేయొసంగుచున్నాఁడనని పలి



కెను. ఆమృగ మమితానందమొంది ఓమహారాజా! చిత్రము
చిత్రము. దివ్యమగు తమదర్శనము యోగించినందులకుఁ దగు
ఫలము సమకూరినపుడు దానిని వలదందునా? యని యం
దుల కామోదించెను. పిమ్మట నామృగము నాభూనాథుఁడు
గురుభావముతో రథము నెక్కించుకొని సగౌరవముగఁ గొని
పోయి సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి ధర్మము లుపదేశిం
పుమని కోరెను. అనంతరము ధర్మదేవత యిట్లు మృగరూపము
ధరించెనన్నట్లు సింహాసన మధిష్ఠించి పలువిధములగు ధర్మము
లనుబోధించి భూతదయయు నహింసయు సత్యము ప్రధాన
ములుగ నిరూపించుచు నాభూపాలునిఁ బరిశుద్ధాంతఃకరణునిఁగా
నొనర్చెను. అదిమొదలా రాజు తనప్రజలనేగాక తన దేశమం
దున్న మృగపక్షులను సయితము దయఁజూచుచు వచ్చెను.
కాఁబట్టి సజ్జనులు పరదుఃఖమును దమదుఃఖముగా భావింతు
రనుటకు సందేహము లేదుగదా!

ఇట్లు పదునాలుగవదగు రురుజాతకము ముగిసెను.

## 15-వ కథ. క్షాంతివాదిజాతకము.

శాంతిధనులై వివేకముగల మహనీయులకు సహింప
రాని దొకటియుఁ గలుగదని చెప్పుటకు సందియము లేదుగదా!
అందులకిదియొక నిదర్శనము వినుఁడు. ఒకప్పుడు బోధిసత్త్వుఁడు
సంసారము బహుదోషభూయిష్ఠమనియు సదియర్థకామప్రధాన
మగుటచే శాంతిమార్గమునకు దూరమనియు రాగద్వేషాది
దూషితమనియు నిస్సారములై పలువిధములగు కార్యములచే

ధర్మమునకుఁ జోటొసంగనిదియునని తలంచి యందులకుఁ బార
పరిగ్రహమే మూలకారణమగుటచే సన్యసించుట యుత్తమ
మార్గమని యెంచి యొకతాపసుఁడయ్యెను. అది మొదలుగా
నతఁడంతయు శాంతియే యుత్తమగుణమని సిద్ధాంతించుచుఁ
దదనురూపముగ ధర్మముల నుపదేశించుచు వచ్చుటచే నాతని
చిన్ననాఁటి నామమును విడిచి క్షాంతివాదియని జనులాతనిఁ
బిలుచు వచ్చిరి. ఐశ్వర్యము విద్య తపస్సు వ్యాపారవిశేష
ములు మున్నగునవి పురుషులనామమును మార్చుటవింతకాదు
గదా! అట్లతఁడు శాంతిగుణప్రభావము నెఱింగినవాఁడగుటచే
దానిని లోకమందెల్ల వ్యాపింపఁ జేయఁదలంచి తత్ప్రధానకథా
సందర్భముల నుపన్యసించుచుఁ దననామమును సార్థకముగాఁ
జేసికొనుచు వచ్చెను. ఇట్లుకొంతకాలము గడచెను. పిమ్మట
నతఁడు మిక్కిలి జనసమ్మర్దము లేకుండుటచే శాంతిరసపూరిత
మన్నట్లు నిర్మలోదకముచేఁ దొణఁకలాడుచున్నట్టియుఁ బుష్ప
ఫలవృక్షములచే నాల్గువైపుల నలంకరింపఁ బడినట్టియుఁ బద్మా
దులచే మనోజ్ఞమగు నొకసరోవరము తీరదేశమున నొక యా
శ్రమము గల్పించుకొని యందునివసించి యుండెను. ఆసరో
వర మొక యరణ్యము నంటియుండుటచేఁ గొందఱు తపోనిధు
లు మాత్రమా ప్రాంతముల నివసించుచుండిరి. ఆబోధి తాప
సుఁ డచ్చటివారినెల్ల ధర్మబోధకములగు ప్రసంగములచే సంత
సింపఁ జేయుచు వారిచే గౌరవింపఁబడుచు వచ్చెను. పిమ్మట
నొకప్పుడా దేశపు రాజయ్యది గ్రీష్మకాలమగుటచే జలక్రీడ
లకై యుత్సహించి యుద్యానముకంటె మిగుల రమణీయమగు



నాయడవిప్రాంతమున్న యాసరోవరమునకుఁదగు పరివారముతో
వచ్చి నందనవనమనందగు నాయడవిని సకలసంపదలతోఁదుల
దూఁగు తనయంతఃపురకాంతలతో విహరించుచుండెను. అచ్చటి
చిలుకలపలుకులు, తుమ్మెదలరొదలు, కోకిలలపంచమధ్వనులు,
మయూరములనర్తనములు, వారిహృదయముల నాకర్షించు
చుండెననుటకు సందియములేదు. అట్లుద్యానవన విహారసుఖ
మును బూర్ణముగాననుభవించి యాటల యలయికచేతను,
మదపారవశ్యముచేతను, నొడలెఱుంగక యారాజొక లతాగృ
హమున సుఖశయన మమరించుకొని నిదురించెను. పిమ్మట
వాని యంతఃపురవనితలందఱు రాజు సుఖనిద్రనొందియుండు
టంగాంచి యింకను వనరామణీయకమును గాంచువేడుకలవీడక
యొక్కొక్క సంఘముగా నేర్పడి, భూషణరవంబులకుఁ దముముద్దు
పలుకులు వన్నెపెట్ట మాటలాడుకొనుచు నావనము నలువైపు
లఁ జెదరి చూడసాగిరి. వారుతొలుతఁ గొంతతడవు మాత్ర
ము విహరించి మరలుతలంపుతో వెడలినను, నావన శోభా
విశేషములు వారిహృదయముల నాకర్షించి వారనుకొనసం
తటి దూరములాగికొని పోవుటచే నావనముదాటి క్రమముగా
మన క్షాంతివాది యాశ్రమపదమును సమీపించిరి. అప్పుడా
యంతఃపురాధికారు లాముని తపఃప్రభావమును గొంత యెఱిం
గినవారయ్యును రాజకాంతలని భయమంది వారినాయాశ్ర
మమునుండి మరలించుటకు యత్నింపరయిరి. ఆరాజ కాంత
లును నాయాశ్రమలక్ష్మి కెంతయునలరి యందుఁజొచ్చి, శాం
తరసము మూర్తీభవించెనో యన్నట్లుండ దపస్సంపదచేఁ దే

జోరూపియై వృక్షమూలము నాశ్రయించి బద్ధాసనాసీనుండగు నాతపస్విని దర్శించిరి. అపుడాతపస్వి పరిభావ మెట్టిదోగాని, వారొక్కసారి తమవిలాసాదులనుగట్టిపెట్టి రూపొందిన వినయములన్నట్లాతనకి నమస్కరించి సేవింపఁదొడంగిరి. అంతట నాతఁడును సమాధినిజాలించి కుశలప్రశ్న పూర్వకముగ వారి కతిథిసత్కారము లొనరించి ధర్మబోధకముగా ఓమహాశయలారా! జన్మములలోనెల్ల మానుషజన్మ ముత్తమమని వేఱ చెప్పనక్కఱలేదుగదా! అట్టి మానవజన్మమొందిన దేహి, దుర్జయములగు నింద్రియముల త్రిప్పులకు లోఁబడక, యశాశ్వతమగు నీదేహముచే శాశ్వతమగు శ్రేయమును సంపాదింప వలసియున్నది. లేనిచోఁ దన్నుఁదా వంచించుకొనువాఁడగుచున్నాఁడు. అందుఁ గేవలము, కులము, రూపము, ధనము మున్నగునవి యున్నను బ్రయోజనములేదు. అట్టికులాదులను దాతృత్వాది సుగుణములు, బంగారమునకుఁ బరిమళమున్న వన్నెదెచ్చునట్లు వెలయింపఁజేయఁదగి యున్నవి. మఱియు నీమానవులందు వారివారి కర్మములనుబట్టి యుత్తమ మధ్యమాధమ భేదంబులు గలుగుచుండును. కావున నిట్టిప్రపంచస్థితిని దేహముల యనిత్యతను, బాగుగ నెఱింగి యెల్లదోషములకును మూలకందమగు కోపమునువిడిచి శాంతిమార్గమునఁ జరించుచుండవలయునని యుపన్యసించెను. అక్కడ నా రాజన్యుఁడు కొంతవిశ్రమించుటచే నలసటసడలి, నిద్రనుండి మేల్కనియు, నిద్రాశేషముచే నెఱ్ఱనగు కన్నులు కొంచెము విప్పి ప్రక్కనున్న శయనపాలికలతో 'పట్టపుదేవులెక్కడ?'



అని ప్రశ్నించెను. ఓరాజోత్తమా! 'ఉపవనశోభ నరయఁగోరి యందులకు విచ్చేసియున్నారు' అని యాశయనపాలికలు బదులు చెప్పిరి. అదివిని యాభూపాలుఁడు, తనదేవేరుల యథేచ్ఛావిహారాదులను, జూడఁగోరి శయనమువిడిచి, ఛత్రచామరాది చిహ్నముల ధరించి తగుపరివారము వెంటరానరణ్యమున నచ్ఛటచ్ఛటఁ దాంబూలరసచిహ్నితమును, బల్లవపుష్పస్తబకలాంఛితమునునగు తనదేవేరుల త్రోవను గుఱుతుపట్టి, క్రమముగా నాయాశ్రమమును సమీపించెను. అచట మునివరుండగు నా క్షాంతివాదియు, నాతనికిరువైపులనున్న దేవేరులును నాతని దృష్టిపథమున బడిరి. సహజగర్వముచే వివేకహీనుఁడును, నసూయాగ్రస్తుఁడును, నగుటచే, నట్టితన దేవేరులయు, నా క్షాంతివాదియు నునికి యాభూవరునకుఁ గోపముగలిగించెను ఆకోపముచే నతఁడొడలెఱుంగక బొమముడిచే భయంకరమగు వదనమునఁ గ్రోధరసముట్టిపడ నామునివర్యునిఁ దిరస్కరించుచు, ఓభటులారా! నాపరిభావమును లక్ష్యపెట్టక నాయంతఃపురజనమును దనకుఁబరివారముగ నొనర్చికొని, మునివేషమూనిన యీరాకిరాతుఁడెవ్వఁడు? అనిబిగ్గరగాఁ బలికెను. అంతట ఓరాజోత్తమా! అట్లుకాదు, ఇతఁడు చిరకాలమునుండియు నీయడవిని దపస్వియై తేజోవంతుఁడును శాంతమూర్తియునై క్షాంతివాదియను పేరొందిన మహానుభావుఁడు అనిచారులు బదులుచెప్పిరి. కాని యాతనిఁగోపదేవత యావేశించుటచే వారివచనములు చెవిఁబడక అయ్యో! వీఁడిట్లు చిరకాలమునుండియు జనులను వంచించుచుండెనా? ఇది మఱియు

మోసమే ! ఇదిగో యిపుడే వీనిమాయావేషమును వెల్లడించెద
నని పలుకుచుఁ దనభటునిచేతినున్న కత్తి నిలాగికొని యాముని
వర్యునిఁ జంపనుద్యమించెను. అపుడా రాజపత్నులాతని రాక
నంతకుమున్నె తమచెలులచే నెఱిఁగి కొంతదూరముగఁ దొలఁగి
మిగులఁ గోపావిష్టుఁడై యున్న యాతనిదర్శింప సమయము గా
దని తలంచి యూరకుండిరి. కాని యాసాహసోద్యమమునుండి
యాతని మరలింపకుండుటతగదని మరలఁ దలంచి బిరబిరం బోయి
వినయవిలాసములతో సమీపించిరి. అది యాతనికి శాంతికా
రణము కాఁజాలకుండుటయె గాక మఱింత యాతనికోపమునకుఁ
గారణమయ్యెను. అట్లయ్యును వారాతని నుపేక్షింపక, ఖడ్గ
హస్తుఁడై మునిపైకి వచ్చుచున్న తమభర్తకడ్డుపడి దేవా !
వలదు వలదు ఇట్టిసాహసము వలదు. భగవంతుఁడగు నీక్షాంతి
వాది తమకోపమునకుఁ బాత్రుఁడు కాఁజాలఁడు అని మరలింపఁ
బోయిరి. ఆమాటలాతని కోపాగ్నికి ఘృతబిందువులగుటయే
గాక, వారెల్లరును వానిమోసమునకుఁ జిక్కి తగులువడిరను
ననుమానమును నయితె మంకురింపఁ జేయ నాభూపాలుఁడు
"వీఁడు పాలుపూసిన విషకుంభమువలెఁ బైకి శాంతివచనము
లను బలుకుచు నిట్లు కాంతాసంపర్కమునఁ దగులువడి యు
న్నాఁడు. దుష్టులమానసము లొకవిధముగను, మాటలింకొక
మాదిరిగను, కార్యము మఱియొకరీతిగను, నుండును. కాన దం
భవ్రతుఁడగు నీతనిమాయలలోఁ బడినందులకు మిమ్ము వివేక
హీనలని చెప్పవలసియున్నద'ని పలికెను. అనంతరము, కాం
తాజనాధికారుల హస్తసంజ్ఞలను గ్రహించి, యారాజపత్ను



లును దమ భర్తృహృదయమును మరలించుట గగనకుసుమ
ముగా నిశ్చయించి సిగ్గుచేఁ దలలవాంచి యూరకుండిరి. పిమ్మ
ట నాభూనాథుఁడు కత్తి యొఱవెఱికి యామునివర్యుని నఱుకఁ
బోఁగా మహానుభావుఁడగు నాబోధితాపసి యాభూపాలుని కో
పాగ్నిని దనశాంతరసముచేఁ జల్లార్పఁ దలఁచి మెల్లగా నిట్లు పలి
కెను. "ఓజనపాలా ! మానవునకు మానావమానము లదృష్టాధీన
ములు. కావున నీయవమానమునకు నేఁ జింతింపనుగాని నాయా
శ్రమమున కరుదెంచినవారి నాదరించుట నాకాచారమయ్యె
ను, నీయెడ నది జరుగనందుల కెంతయుఁ జింతించుచున్నాఁడను.
మఱియు నోరాజా ! లోకోపకర్తలగు మీవంటి జనపాలుర
కుఁ జెడుత్రోవలనుండి దుర్జనుల మరలించుటపాడిగాని మీ
రే యిట్టిత్రొందరపాటు నొందుట నీతిగాదు. సాహసముచితా
నుచితముల నెఱుంగనీయదు. భూపాలుఁడు తనప్రజలకు ధర్మా
ర్థకామములను గలిగించుచు దానిచేఁ దానధికుఁడనఁ దగియు
న్నాఁడు. నీరక్షణమున నున్న యివ్వనమున నాచే నిట్టి యకృ
త్యము జరుపఁబడుచున్నదనిగదా నీతలంపు అట్టినీవు స్వయ
ముగ నిట్టి సాహసకృత్యమేల చేయఁబూనుచున్నాఁడవు. నీయం
తఃపురకాంతలు నీస్త్రీజనాధికృతులతోఁ గూడి నాయాశ్ర
మమునకు వచ్చుటసముచితము, నాయపరాధముగ భావించితివి.
లేనిచో నీమొగమింత యెఱ్ఱపడునా ? నీకన్నులనుండి నిప్పులు
రాలునా ? పోనిమ్ము. ఇందును నాయపరాధము గలదనుకొం
దము. కాని శాంతిభూషణము నీ వేల యలంకరించుకొనఁగూ
డదు ? ఆయలంకారము తెల్లనికాంతిగలది. చల్లనిగుణము

గలది. మృదువైనది. అందును రాజులచేఁదఱచుగ భూషించుకొనఁదగినదిగా నెన్నఁబడి యున్నది." అదివినియు, నారాజాధముఁడు "ఓకపటతపస్వీ! ఈశాంతోపన్యాసముతోఁ బని లేదు. నిజముగ నీహృదయము విరక్తమును శాంతిభరితమును నై వ్రతనిష్ఠగలదేని, యిట్లునావలని యభయమేల కోరవలెనో యెఱుఁగకున్నాఁడను, తొలుత దానికి సమాధానము చెప్పుమ"ని ప్రశ్నించెను. బోధిసత్త్వుఁడు "ఓరాజా! నిరపరాధియగు నొకబీదతాపసిని, రాజోత్తముఁడొకఁడు చంపెననుపకీర్తి నీకుశాశ్వతమై యుండుట కొఱకై యిట్లువలదంటినిగాని, ప్రాణులకు నియతముగు మరణమునకు శంకించి గాదు. ఎపుడేని నశింపఁదగిన యీదేహమిపుడే నశించునని విచారింతునా? నీకుసంభవించిన ధర్మహాని మఱితొలఁగదని యిట్లునిన్నుఁ బ్రార్థించితినిగాని వేఱొండుగాద"ని నొక్కివక్కాణించెను. అతని యుపన్యాసమంతయు బూడిదనుబోసిన పన్నీరువలె వ్యర్థమగుటచే, నారాజాధముఁడామునివర్యునితో నీశాంతమెట్టిదో చూచెదనని పలుకుచు నిరపరాధియగు నాబీదతాపసి దక్షిణహస్తమును దనవాడిగల కత్తిచే నాళమునుండి కమలమువలెఁ దెగనేసెను. అహా! ఆతపస్విహృదయ మెట్టిపవిత్రమైనదోగాని, తనహస్తము తెగినందులకుఁ గలుగవలసిన దుఃఖముకంటె, నఱికిన యారాజునకుఁ గలుగఁబోవు దుర్యశమాతనికి మిగుల దుఃఖకరమై బాధింపఁ దొడఁగెను. అట్లు తన్నుఁగూర్చి వ్యసనపడుచున్న యాతపస్వితో "ఓయీ! ఇప్పటికిని నీదంభవ్రతమును విడువవే? ఎంతటి గట్టితనము. ఏదీ! నీశాంత



మెట్టిదో మరలఁ జూచెదనుగాక" యని భయపెట్టెను. అప్పుడు బోధిసత్త్వుఁడు అయ్యో! వీనికి నాచెప్పినహితమహితమై తోఁచినది. ఇఁకఁజెప్పిన లాభమేమి? అని యూరకుండెను. పిమ్మటఁ గఠినాత్ముఁడగు నారాజు మఱలఁ గత్తినెత్తి యాతాపసి రెండవహస్తమును, బాహువులును, బాదములను, నాసికతోఁగూడఁ గర్ణములను, దననిర్దయమగు హస్తముతో నఱికెను. అహా! అవివేకియగు నారాజట్లు తప్పించుకయెఱుంగని తనయవయవములఁ గ్రమముగ నఱుకుచుండునపుడా క్షాంతివాది శోకింపఁడు. కోపింపఁడు. శరీరయంత్రనిర్మాణతత్త్వమెఱింగి చిరపరిచితమగు శాంతినివిడువక కొండవలెఁ జలింపక వెనుకటివలె నాభూపాలునకు సంభవించిన ధర్మహానికిఁ జింతించుచుండెను. అనంతరమా జనపాలాపసదుండా యడవిని విడిచి వెంటనే యగ్నితుల్యమగు మహాజ్వరమొకటి తన్నావేశింప బీటవాఱిన భూమిలోఁగ్రుంగి రసాతలపురప్రవేశ మొనర్చెను. "పాపపుణ్యము లధికములై వెంటనేఫలమొసంగును" అను పెద్దలవచనము వృథయగునా? అపుడు దేశమున గొప్ప కోలాహలమును, రాజకులమున మిగులఁగలఁతయు జనించెను. మంత్రులు మున్నగువారందులకు బెగిలి యామునివర్యుని కోపమే యందులకుఁ గారణమైయుండుననియు, నింకఁదమదేశమునకెల్ల నిక్లేమువ్వచ్చుననియుఁ దలంచి యాక్షాంతివాది సన్నిధిఁజేరి "ఓమహానీయా! తమకు ముప్పు గూర్పఁ దలఁచి నశించినవాని పౌరులము. మేము నీకోపాగ్నికిఁ బాత్రులము కాకుండుటకై ప్రార్థింపవచ్చితిమి. దీనులము. కావుననీయా

దేశమును, నీధర్మమును రక్షించుకొనుము" అని సవినయముగా నాతనిపాదములపైఁబడిరి. అపుడు బోధిసత్త్వుఁడు ఓపౌరులారా భయమందకుఁడు. వానిపైఁగోపింపనినాకు మీపైఁ గోపమున్నట్టిది? అల్పమగు మనోవ్యథకుఁగా నాశాంతిని విడిచికొనుట యెన్నఁడును సంభవింపనేరదని యూహింపుఁడు. పొండు మీకు శుభమగుఁగాక యని వారినూరడించి యాక్షాంతివాదియాదేహమును జాలించి స్వర్గము నలంకరించెను. శాంతకోపములకీ మునియు, నీజనపాలుఁడు నిదర్శనము కాఁగలరని చెప్పవచ్చును.

ఇట్లు పదునైదవదగు క్షాంతివాదిజాతకము ముగిసెను.

## 16-వ కథ. సుతసోమజాతకము

మానవులకు సజ్జనసాంగత్యము శ్రేయోదాయకమని చెప్పుటకు సందియములేదు. కావున శ్రేయోభిలాషియగు వాఁడవశ్యము సత్సాంగత్య మొనర్పవలయును. భగవంతుఁడనఁదగు బోధిసత్త్వుఁ డొకప్పుడు, యశోవంతమును, ప్రజానురంజకమును, సకలరాజన్యవందనీయమునై జగత్ప్రసిద్ధినొందిన కురువంశమున జనించెను. ఇతఁడు చంద్రునివలెఁ బ్రియదర్శనుఁడును, సుగుణకిరణములచేఁ బ్రకాశించువాఁడును, సోముఁడని తలంచి యాతనికిఁ దండ్రి సుతసోముఁడని పేరిడెను. ఇతఁడును శుక్లపక్షపుఁ జంద్రునివలె దినదిన ప్రవర్ధమానుండై కాలక్రమమున వేదవేదాంగములనభ్యసించి తనసుగుణములచేఁ బ్రజల ననురంజింపఁ దగినవాఁడయ్యెను. అట్లగుటచేఁ బ్రజలందఱును, నతఁడు తమకెన్నఁడు ప్రభువగునోయని యువ్వి



ళ్ళూరుచుండిరి. ఇట్లు కొన్నిదినములైనపిదప సుతసోముని తండ్రియు, యౌవరాజ్యమును దనపుత్త్రుఁ డేలుట చూచుభాగ్యమును దాననుభవింపఁ గోర్కిగలిగి యాతనినందుఁ బట్టభద్రునిఁ గావించెను. సుతసోముఁడును యువరాజై ప్రజలకమందానంద మొదవించుచు గుణవంతుఁడను ప్రఖ్యాతివడసెను. అట్లు కొంతకాలము గడచెను. క్రమముగ నామహాపురుషుని యౌవనముతోఁగూడఁ గాలపురుషునకు వసంతావిర్భావము కలిగెను. ఆవసంతఋతువున మొఱడులకు సైతము జీవమంకురించెను. వనకాంతామణి, యొకఁ బుష్పవతియగు ననుతలంపునఁ గెంపుటుంగరములచే శాఖాగ్రహస్తము లలంకరింపఁబడినట్టులఁ జెట్లెల్లెడలఁ జిగుళ్ళగము లలరారుచుండెను. మఱియు నవ్వనలక్ష్మి తనకుఁగలిగిన మాధవసమాగమమున కలరునదివోలెఁ బువ్వులనెడు చిఱునవ్వులచే వెలయుచుండెను. అట్టితరుణమున సుతసోముఁ డుపవనవిహార మొనరింపఁ గుతూహలపడి తగుపరివారముతో వెడలి తనభార్యతోఁ బురోద్యానమునకుఁ బోయెను. అచటఁగొందఱుకాంతలు పలువిధములగు నృత్యగీతాదులచే నాతని డెందమున కానందము గలిగించిరి. అట్లతఁడా యుద్యానమున విహరించుసమయమున నచటికొక పండితకవి యాతనిదర్శింపవచ్చెను. సుతసోముఁడును, నాతని సాదరముగ రావించి యాతనివలన సుభాషితములను వినుచుండెను. అంతటనచట హఠాత్తుగ నొకకలకలము జనించెను. అదియప్పటి యుత్సాహమునకు విఘ్నకారియు స్త్రీజనమునకు భయప్రదమును నై కన్పట్టుటచే సుతసోముఁడదేమో తెలిసికొని

రండనితనసేవకులనంపెను. పిమ్మటవారునుభయవిషాదములచే
దీనులై నడకలుతడఁబడవచ్చి ఓరాజకుమారా! సుదాసుని కొ
మరుఁడగు కల్మాషపాదుఁడను రాక్షసుఁడొకఁడు యమునివలె
నిటకును వచ్చుచున్నాఁడు. వీనిరాక యెఱిఁగి వీనిపయికి వెడలి
న మనబలములన్నియు జడిసి, రథగజాశ్వములతో నిదిగోనిట
పైపై పఱుగిడుచువచ్చుచున్నవి. వాఁడు మనుష్యమాంసాభిలా
షియై పౌరులనుజంపుటకు సిద్ధపడియున్నాఁడు. కావునసంతా
లకుఁ బ్రతీకార మొనర్పవలయునని పౌరులేకముఖముగ మిమ్ముఁ
బ్రార్థించుచున్నారని చెప్పిరి. సుతసోముఁడు దిగ్గనలేచి క
ల్మాషపాదుఁడా? ఏమివాఁడిట్లయ్యెనని ప్రశ్నింపఁగా వారు, ఓ
దేవా! తమరెఱుంగుదురుగదా! సుదాసుఁడను నొకరాజుగలఁ
డు. అతఁడొకప్పుడు వేఁటకై బయలువెడలిపోవుచు నొకగహన
మగు నడవిఁజొచ్చెను. పిమ్మటసేనలన్నియుఁ జెదరి రాజసహా
యుఁడై యాగహనమునుండి వెడలఁజాలక కొన్నిదినములుండు
ట సంభవించెను. విధివిలాసమెట్టిదో యట్టిసమయమున నొక
యాఁడుసింహముతో నతఁడుసంగమించెనఁట. అదిగర్భవతియై
కాలక్రమమున నొకకుమారునిఁ గనెనఁట. పిమ్మటనాశిశువును
శబరులుపెంచి కాలక్రమముననాదేశమున కధీశుఁడగునాసుదా
సున కర్పించిరి. అతఁడా బాలుఁడు తనకుజనించెనని యెఱుం
గకున్నను నపుత్రకుఁడగుటచే నప్రయత్నముగ లభించిన యా
బాలునేలవిడువవలయునని తలంచి పెంచిపెద్దచేసెను. పిమ్మటఁగొ
న్నినాళ్లకు సుదాసుఁడు తనపుత్రుని దుర్వర్తనములఁ జూడఁజా
లనివానివలె స్వర్గతుఁడయ్యెను. అనంతర మీకల్మాషపాదుఁడు



మాతృదోషముచే మాంసాభిలాషియై యందునుమనుష్య
మాంసము మఱియునాస్వాద్యమనితలంచి తొలుతఁదనపౌరుల
నెల్లఁ గాలక్రమమున భక్షించుటకు మొదలిడెనఁట. అంతటఁ
బౌరులెల్లనుగుమిగూడి వానివధకై ప్రబలప్రయత్నము లొన
ర్చిరఁట అపుడీరాక్షసుఁడు భయంపడి తనకీపరినుండియు
నపాయమురాకుండ మాంసప్రియలగు దేవతలనారాధించి నూ
ర్వురరాజపుత్రుల బలియిచ్చెదనని ప్రతిజ్ఞచేసెనఁట. అట్లెకొం
దఱురాకొమరు లపహరింపఁబడిరి. మఱియునిపుడు తమ్మపహ
రింపనెంచి యిందులకువచ్చుచుండెనఁట" యనివానివృత్తాంత
మంతయుఁ జెప్పిరి. పిమ్మట సుతసోముఁడును వానివృత్తమొ
కింత తనశ్రవణపథమునఁ బడియుండుటచేఁ నెట్టులయిన వానిశీ
లమును బాగుచేయవలెనని తలంచి తనపరివారముతో ఓయీ!
రాజ్యభ్రష్టుఁడై నరమాంసవ్యసనముచే నున్మత్తుఁడనఁదగి దుర్ద
శనుజెంది యధముఁడైయున్న కల్మాషపాదునిపై పరాక్రమించుట
సరికాదు. ఒకప్పుడువానిమేలునకై హితముపదేశింపఁ దలఁచిన
మాకు వాఁడుద్రోహమొనర్పఁ బూనెనేని వానిశాసనము సేసి
యుంచెదము. కావున మీరీయధికారములం దప్రమత్తులై
యుండుఁడని వారికాజ్ఞాపించి విషణ్ణులైపోవలదని తనస్త్రీవర్గము
పడియెడు యువతీజనమునుమరలించి యొకలక్షలముగల చోటికిఁ
బోయెను. అచటపులినవసనమునుగట్టినట్టియు ధూళిధూస
రితములై వ్రేలాడుకఱకుజెంద్రుకలుగలట్టియు మిగులఁ బెఱిగిన
మీనములావరించుటచే నంధకారపూరితమగు కూపమువంటి
వదనముగలట్టియు భయంకరాకారముగల యొకరక్కసునిం

గాంచి, వానికివెఱచి పరువిడిపోవుచున్న సైన్యములనుమరలించి నిర్భయముగా వానితో ఓరీ! నేనుసుతసోముఁడను. దీనులగు నాయోధులపై నీపరాక్రమమేల చూపెదవు? ఇటురమ్ము. నాహితవచనములను వినుమని పలుకునంతలో నాసౌదాసుఁడా సుతసోముని వచనములను వినకయే మఱియుఁ బెచ్చుపెఱిగిన గర్వముతో సింహమువలె వానిపయిపురికెను. అట్లుమరలి నిరాయుధుఁడును సహజప్రసన్నముఖుఁడునునగు నా సుతసోమునిపయికి లంఘించి యిదెనిన్ను భక్షించుచున్నాఁడనని పలుకుచు వానిఁదనమూపుపై నెక్కించుకొని పర్విడుచుండ నాతని సాహసమునకు మిగులబెగిలి రాజసైన్యము పటాపంచలై చెదరి పురమునకుఁబోయి సౌదాసునిఁజంపుటకు యువరాజేగెనని యు నాతనిఁజంపివచ్చునని యు రాజునకెఱిఁగించిరి. అపుడు సుతసోముఁడగుబోధిసత్త్వుఁడు వీనిశాసించుటకిదియదనుగాదని యూరకుండెను. పిమ్మట నాసౌదాసుఁడు తనయభిమతము సిద్ధించెనని యుప్పొంగుచుఁ బెన్నిధిఁగన్న పేదవలె సుతసోమునిఁదనయావాసమునకుఁగొంపోయెను. అయ్యది స్మశానవాటికవలె భూతభేతాళాదులకునెలవై చూచువారికిమిగులభయముగొలుపుచుండెను. అట్టితనయాలయమునకాతనిఁ గొంపోయి యచటనిలిపి వానిశరీరలావణ్యాతిశయమునకచ్చెరువడుచుఁ గల్మాషపాదుఁడు కొంత తడవువిశ్రమించెను. బోధిసత్త్వుఁడు తనకుసుభాషితములుజెప్పవచ్చిన పండితుఁడక్కడఁ దనరాకకు నిరీక్షించుచుండునని యెంచి అయ్యో! నాకుసుభాషితములఁ గఱపనెంచి కడుదూరమునుండివచ్చిన యాపండితోత్తముఁడు నేను మరణించితునని శంకించి



యెంత చింతించునో? నేనిట్లుతన్నంపక విడిచివచ్చినందులకు నన్నేనిందించునో లేక తనయభాగ్యమిట్లున్నదని తన్నేదూషించుకొనునో యనిపలువిధములఁ జింతించుటచే దయామయమగు నాతనిహృదయముకరఁగి కనులవెంబడిని జారెనో యనునట్లాతనికిఁ గన్నీరుగారఁజొచ్చెను. సౌదాసుఁడదిగాంచి యించుకనగుచు ఓయీ! నీవుమిక్కిలి ధైర్యశాలివని ప్రసిద్ధివడసిన వాఁడవే? నాచేనిట్లు చిక్కినందులకింత చింతిలనేటికి? అహా! నిన్ననేటికి? ఎట్టివానికిని నాపదలందు ధైర్యమును నభాగ్యదశలోఁ బాండిత్యమును విఫలములగును. రాజకుమారా! మిక్కిలిప్రియములగు ప్రాణములా లేక సకలసుఖసాధనమగు ధనమా నీదుఃఖమునకుఁ గారణము? అట్లుగాక దారపుత్త్రాదులను దలంచికొని యిట్లుదుఃఖించుచుంటివా? నిజమెఱిఁగింపుమని ప్రశ్నించెను. అదివిని సుతసోముఁడు ఓయీ! నారోదనమునకుఁ గారణమడిగెదవా వినుము. నీవనుకొనినట్లు ప్రాణములకుఁగాని, దారపుత్త్రాదుల విషయమునఁగాని, నేను విచారింపలేదని నిజముగఁజెప్పుచున్నాఁడను. నేనని కడుదవ్వులనుండి వచ్చిన యావిప్రోత్తముఁడు నారాకకై నిరీక్షించి నిరీక్షించి తుదకునేనిట్లగుటవిని నిరాశచేసికొని మరలునేమోయని చింతించుచుంటిని. మఱియు నొకటిచెప్పుచున్నాఁడను వినుము. నేఁబోయి యాభూసురోత్తముని సత్కరించివచ్చెదను. నీవు మఱియొకవిధముగా భావింపకుము. నామార్గమొకటి యన్యులవిధము వేఱొకటియని తలంపుమని పలికెను. పిమ్మట సౌదాసుఁడు ఓయీ! ఇట్టిమాట లెవ్వరునమ్మెదరు? మృత్యుముఖమునుండి

వెడలినవాఁడు మరలనందుఁజొరఁదలంచునా? నీవు మృత్యుతుల్యమగు నాచేతనుండితప్పి సుఖముగనింటనుండక మరలనాకడకువచ్చుటకుఁ గారణమగపడదని పలికెను. అదివిని సౌదాసా! నేనువచ్చుటకంత గొప్పకారణముండవలెనా? మరలవచ్చెదనని చెప్పితినిగాదా! అదిచాలును. ఈసుతసోముని సామాన్యునిఁగా భావించుచుంటివా? సామాన్యముగ మృత్యుభయముచేఁగాని, లోభముచేఁగాని, సత్యమును దృణముగభావించి విడిచెదరు. సత్పురుషులట్లుగాక సత్యమునకే తమధనమును జీవితమును ధారవోయుదురుగానిసత్యమునువిడువనొల్లరు. ఓయీ! నాప్రాణముల రక్షించుకొను తలంపు దృఢముగనాకుఁ గలిగెనేని నిరాయుధుఁడనై నీవలకివచ్చెదనా? నీవు శంకింపకుము. ఆబ్రాహ్మణుని సత్కరించి తప్పక నీకడకరుదెంచెదను. ఈబోఁటులెన్నఁడు ననృతము పలుకరని నమ్ముమని దృఢముగాఁ జెప్పెను. ఆబోధిసత్త్వుని వచనములచే వానిసత్యమును బరీక్షింపవలెనని కుతూహలముగలిగి "ఈసుతసోముఁడు కడుసత్యవాదినని గర్వించుచున్నాఁడు. వీనికి సత్యమందుఁగల పట్టుదలనుజూచెదనుగాక. ఒకప్పుడితఁడు రాకచిక్కినను నూర్వురు రాజకుమారులింతకుమున్నే నాచేసంపాదింపబడియున్నారు. వారివలన నాభూతయజ్ఞము నిర్వర్తింపఁబడు"నని చింతించి ఓసుతసోమా! అట్లయినఁ బోయివేగరమ్ము. నీసత్యమెట్టిదో చూచెదనని యాతనిపోకకు సమ్మతించెను. పిమ్మట బోధిసత్త్వుఁడు తనయుద్యానవన భవనమునకుఁబోయి తనరాకకై నిరీక్షించియున్న యావిప్రునివలన మరిల నాల్గుసుభాషితములను విని



వానికివేయిగద్యలుగాభావించి వానినమితముగసత్కరించిపంపెను. ఈవృత్తాంతమంతయువిని సుతసోమునితండ్రి యాతనిఁ బిలిపించెను. తనతండ్రి తన్నట్లుపిలిపించుటకుఁ గారణ మెఱుంగఁడు గాని కారణమేదోయుండునని మాత్రముతలంచి సవినయముగాఁ బోయి యాతనిచెంత నిలువఁబడి యుండెను. అంతటఁదండ్రి కుమారా! నీవు సౌదాసుని జయించివచ్చినందులకు సంతసమే కాని నేనొక్కవిషయ మెఱిగించుటకు నిన్ను రావించితిని. నీవుసుభాషితములనుపన్యసించిన పండితునకొసఁగిన సత్కారమమితమని వినియున్నాఁడను. సహస్రసంఖ్యాకమగుజనము నీచే భరింపఁదగియుండెనని యెఱుంగుదువుగదా! మఱియు రాచసిరికిఁ గోశసంపదమూలమని నయజ్ఞులుచెప్పుదురు. ఈవికి నౌచిత్య ముండవలయును. కాని వెఱ్ఱిగానొసఁగినచోఁ గుబేరుఁడు సయితము దరిద్రుఁడు కాకతప్పదు. అర్థమే సకలార్థములకుసాధకము. కావునఁ దదవిరోధముగఁ ద్యాగమొనర్పవలెను. అట్లొనర్పని భూపాలునిఁ గోశహీనుఁడని తలంచి రాజ్యరమ వేశ్యకాంతవలె నిరనురాగయై పరికించి క్రమముగానొప్పరికించును. కావున నీకీయతిత్యాగమనుచితమని హితముపదేశించెను. అదివినిబోధిసత్త్వుఁడు ఓతండ్రీ! అమూల్యమగు సుభాషితములకు మూల్యము విలువనిర్ణయింపగలమా? అవ్వి చోరులపహరించుటకు వలనుపడని ధనము. తమమణఁగించెడి దీపము. కామక్రోధాది శత్రుసంహారమునకుఁ దగినశస్త్రము. చిత్తము వికలమగునపుడు నయమార్గముజూపుమంత్రి. ఇది యివియని చెప్పనేల? వానిఫలములసంఖ్యాకములు. తండ్రీ! సమ

ర్థుఁడనై యుండియు సత్పాత్రములనుసత్కరింపకుండుట కనుపప
డదు. నీయాజ్ఞనుల్లంఘింపఁజాలను నాస్వభావమును మార్చు
కొనఁజాలను. ఇదియేల? ఈరాజ్యముతో నాకిఁకఁ బనిలేదు.
నేనిపుడే సౌదాసునికడకుఁబోయి నాసమయము నవంధ్య ము
సల్పికొనియెదనని బహులు చెప్పెను. అంతటఁ దనతనయుని ప్ర
తిజ్ఞావృత్తాంతమువిని పుత్రా! నీహితముకై చెప్పిన నావచన
ములకీవిట్లుకోపింపనేల? సౌదాసునికడకుఁ బోవుట నీకేటికి?
ఒకప్పుడు నీవు ప్రతిజ్ఞాపూర్తికై పోయెదనన్నను నేనందులకు
సమ్మతింపను. స్వప్రాణరక్షణమందును గురుజనవాక్య పరిపా
లనమందును నసత్యము దోషాధాయకముకాదని పెద్దలయభి
ప్రాయము. మఱియు నర్థకామములకు విరోధమగుధర్మపథము
ధర్మపథము కానేరదని రాజనీతిజ్ఞులు చెప్పుదురు. ఎట్లైనివాని
కడకుఁ బోకుండుట యసత్యమగు నందువేని నీవెనుక హ స్త్య
శ్వరథపదాతిసైన్యముల సిద్ధపఱచి తోడ్కొనిపొమ్ము. వాని
వలనఁ గీడుమూడదని తోఁచినసరే. లేనిచో వానినెదిరించి
జయించిరమ్మని చెప్పెను. బోధిసత్త్వుఁడదివిని ఓరాజోత్తమా!
ఒకరీతిగఁ బ్రతిజ్ఞనొనరించి యింకొకరీతిగ నొనరించుటకు నా
మనంబంగీకరింపకున్నయది. మఱియు సర్వజనపరిత్యక్తుఁడును
నరకలోకాభిముఖుండునునగు నాసౌదాసహతకునిఁ జంపఁబోవ
అయునా? నరమాంసభోజియు దుష్టుఁడునగు సౌదాసుఁడును
యితము తనయుదారతనువెల్లడించి నాపలుకుఁబడికినచ్చి నన్ని
ట్లువిడిచెను. కావుననే మరలసుభాషితముల వినఁగలిగితిని. అ
ట్లగుట విశేషించి యతఁడు నాకుపకారిగాని దండ్యుఁడు



గానేరఁడు. తండ్రీ! సౌదాసుఁడు నన్నుఁజంపునను భయముడిగి
యుండుము. ఇంతకు వాఁడు నన్నేమిచేయఁగలఁడు? అని సుతసో
ముఁడు తనతండ్రినూరడించి సత్యానురాగముచేఁ దగుపరివార
మును వెంటనిడికొని సౌదాసునావాసమునకుఁ బోయెను.
సౌదాసుఁడును సుతసోముని దూరమునుండియే గాంచి బహు
కాలాభ్యస్తమయ్యును దనక్రూరతను విడిచి ప్రసన్నముఖుఁడై
ఆహా! ఆశ్చర్యములలో నాశ్చర్యము ఇట్టిసత్యపథమును నిట్టి
యౌదార్యాతిశయమును నెందయినఁ గాంచితిమే? మృత్యు
ముఖమునఁదగు నాసదనమునకు నిర్భయుఁడై స్వయముగవచ్చు
చుండెనే! ఆ! ఏమి ఈతని ధైర్యము? సత్యమునకై తనధనప్రాణ
ములను బరిత్యజింపఁదలఁచెనే? సత్యవంతుఁడన నితఁడుగాక
మరెవ్వఁడు? అని చింతించెను. పిమ్మట బోధిసత్త్వుఁడాతని స
మీపించి ఓయీ! నీయనుగ్రహముచే సుభాషితములనువిని
తదనురూపముగ వానిసత్కరించివచ్చితిని. ఇఁకనీయిచ్చవచ్చిన
ట్లుచేయవచ్చునని పలికెను. అదివిని సౌదాసుఁడు సజ్జనసంసర్గము
తనహృదయక్రౌర్యమును గొంచెమడఁగింప ఓసుతసోమా!
నాయాహారకాలమతిక్రమింపలేదు. కావున నీవినినసుభాషిత
ములఁ గొన్నిటినుపన్యసింపుము. పిమ్మటకథనుజూచుకొనెద
మని పలుకఁగా విని బోధిసత్త్వుఁడు ఓయీ! నీకీసుభాషితము
లతోఁ బనిలేదు. నిర్దయుఁడవై యుదరపోషణమునకుఁ బాటు
పడు నీవిట్లు ధర్మశ్రవణమునుగోరనేటికి? నీపనిఁగావించుకొమ్మ
ని చెప్పెను. అదివిని సౌదాసుఁడందులకు సమ్మతింపక సుభా
షితోపన్యాసమునకై పలువిధముల నాతనినిర్బంధించెను. పిమ్మ

ట వారిరువురకును గొంతతడవు సత్ప్రసంగములు జరిగెను. ఆప్రసంగములు తుదకు సౌదాసుని సుతసోమునకుఁ బౌద్ధ శ్రాంతునిఁగా నొనర్చెను. అట్లు సుతసోమునియెడ మిగుల భక్తిగలిగి యొకనాఁడు ఓమహానీయా! నీసదుపన్యాసమెంతయు నాడెందమునకు నమందానంద మొదవించెను. ఇఁక నేమనుష్య మాంసమును భుజింపను సరేగదా నీయిచ్చవచ్చినట్లు మెలంగెదను. మఱియు నాచేఁ గారాగృహబద్ధులగు రాజపుత్రులను విడిపించితి మురమ్మని పలికెను. పిమ్మట వారిరువురును గలిసి రాజపుత్రులకడకుఁ బోయిరి. వారును సుతసోమునిఁ జూచినతోడనే యింక నీబంధములనుండి విముక్తులమగుదుమను నిశ్చయముచేఁ జంద్రోదయమగుడుఁ గలువలవలె వికసితముఖులైరి. సుతసోముఁడును నారాజపుత్రులనూరడించి యిఁక నిక్కెవ్వరికిని ద్రోహమొనరింపకుండునట్లు సౌదాసునిచే శపథములఁ గావింపించి యారాజపుత్రులను దానును దమపురమునకుఁ బోయి కొన్ని దినములయినపిదప వారిని వారివారి రాజ్యములకంపి సుఖముగఁ గాలముగడపెను. ఈచరిత్రాంశములచే బుద్ధుఁడు తనపూర్వజన్మములందుసయితము పరోపకారియనియు, ధర్మశ్రవణముచే దోషములడంగి గుణవంతులగుదురనియు సత్యము ధర్మములలో నుత్తమమైనదనియుఁ దెలియుచున్నదికదా!

ఇట్లు పదునాఱవదగు సుతసోమజాతకము ముగిసెను.




శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, విజయనగరము.

